PPBUMOZA164

సాహిత్య
ప్రస్థానం
అక్టోబర్ 2015

సంపుటి : 14 సంచిక : 10

## భావ ప్రకటన స్వేచ్ఛను కాపాడుకోవాలి

నరేందర్ దబోల్కర్, గోవింద్ పన్సారే, ఇప్పుడు కల్బుర్గి. ఉన్నత మానవ సమాజాన్ని కలగన్న మానవతా వాదులు. విద్యావేత్తలు. రచయితలు. సమాజంలో నెలకొన్న మూఢత్వాలపై రాజీలేకుండా పోరాడిన సాహసులు. అతిపెద్ద ప్రజాస్వామ్య దేశంలో భిన్నాభిప్రాయాలు కలిగి ఉన్నందుకు ప్రాణాలు కోల్పోయారు. తమిళనాడులో కులోన్మాద అరాచక శక్తుల దౌర్జన్యానికి రచయిత పెరుమాళ్ మురుగన్ తీవ్ర మనస్థాపానికి గురయ్యారు. రచయితగా నేను నిష్క్రమిస్తున్నాను అని ప్రకటించారు. ఆయన ఆ విధమైన నిర్ణయం తీసుకోక పోయి ఉన్నట్లైతే బహుశా ఆయనను కూడా హత్యచేసేవారేమో. ముఖ్యంగా మెజారిటీ మతోన్మాదం ప్రదర్శిస్తున్న అసహనం హద్దులు దాటి హత్యలకు దారితీయటం అత్యంత ప్రమాదకరం. ఇటీవల కాలంలో వెంటవెంటనే జరిగిన ఈ ఘటనలు సామాజిక మార్పుకోరుకునే ప్రతీ ఒక్కరినీ ఆందోళనకు గురిచేస్తున్నాయి. మానవ నాగరికత సతీసహగమనం వంటి మూఢనమ్మకాల్ని, ఛాందసత్వాన్ని వదుల్చుకోగలిగిందంటే రాజారామ్మోహన్ రాయ్ నుండి కందుకూరి వీరేశలింగం వంటి మహానుభావుల కృషి మరువలేనిది. సమాజంలో నాగరికత వికసించే కొలదీ ఆటంకంగా ఉన్న ఆచారాలు, అభిప్రాయాలూ వెనకడుగు వేస్తాయి. వేల సంవత్సరాల కాలం నుంచీ ఇప్పటి వరకూ ఎన్నో మూఢనమ్మకాలు కొనసాగలేక ఆగిపోయాయి. మహిళల వస్త్రాలంకరణ దగ్గర నుండి సినిమాల వరకు ఈ అరాచక శక్తులు సంప్రదాయాల పేర, ఆచారాల పేర దాడులు చేయడం చూస్తున్నాం. మన రాజ్యాంగం లౌకిక రాజ్యాంగం. మతం వ్యక్తిగతమని నిర్ధిష్టంగా నిర్దేశించింది. ప్రభుత్వంలో ఉన్న వారు ఈ రాజ్యాంగ హక్కులను రక్షించాల్సిన బాధ్యతను తీసుకోవాలి. ఇందుకు విరుద్ధంగా ప్రభుత్వంలో బాధ్యతాయుత స్థానాలలో ఉన్నవారి ఇటీవల వ్యాఖ్యలు వాతావరణాన్ని మరింతగా చెడగొట్టేవిగా ఉండటం విచారకరం. మరిన్ని ఇటువంటి సంఘటనలు జరక్కుండా ప్రభుత్వం నిందితులపై సత్వర చర్యలు తీసుకోవాలి. అభ్యుదయ, ప్రగతిశీల, ప్రజస్వామిక వాదులు ఈ దాడులను ఎదుర్కోవడానికి సదా సన్నద్ధంగా ఉండాలి. ప్రశ్నించే గొంతులన్నీ ఐక్యమై మూఢత్వానికి, అనాగరిక చర్యలకు వ్యతిరేకంగా పోరాడాలి. ఆ దిశగా రచయితలు, బుద్ధిజీవులు తమ శక్తినంతా కేంద్రీకరించి ఈ అరాచక శక్తుల ఆటకట్టించాలి. భావప్రకటనా స్వేచ్ఛను కాపాడుకోవాలి.

కవర్ ఫొటో : టి.ఎస్. రెడ్డి (ఫొటో ఇండియా)

బొమ్మలు : తుంబలి శివాజి, గంగాధర్, మీరా

## ఈ సంచికలో ...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్టీసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:
ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002,
సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# గ్లోబల్ కవి

- డా॥ ఎన్. గోపి



అతడు కాడలు లేని పువ్వుల్ని
వెదజల్లుతున్నాడు
నీడలు లేని చెట్లను కీర్తిస్తున్నాడు
వేళ్లను పెకలించి ముక్కలు చేసి
పలుచోట్ల ఎగరేస్తున్నాడు

అతని గొంతులో
కోకిలలు లేవు గాని
మరేవో పక్షులు కువకువలాడుతున్నాయి
అతని చూపులు
ఒకచోట నిలువడం లేదు

విదేశాలు తిరగడమే
అంతర్జాతీయమంటున్నాడు
ఎయిర్ హోస్టెస్‌ను
ప్రపంచ వనితగా భావిస్తున్నాడు.

ఎంత అందంగా ఉన్నాడతడు!
ఎంత స్ఫుటమైన శబ్దమతనిది!!
అతని మనోహర విశ్లేషణ
తీగలన్నీ పాల్గొనని వీణ.

అతని చమత్కారాల్లో
టాగూర్ కనుమరుగయ్యాడు
జాషువా విశ్వనరుడు చచ్చిపోయాడు
శ్రీ శ్రీ ప్రపంచ మానవుడు నిష్క్రమించాడు
శ్రోతలకు న్యూనతను పంచడంలో
అతడు విజయం సాధించాడు

కవిత్వమంటే అతనికి
నిద్రపట్టని సంవేదన కాదు

దేశాల సంచారంలో దినచర్య
ఖరీదైన ప్రచురణకర్తలు
అతని కవిత్వాన్ని ప్రచురిస్తారు.

పెద్ద పత్రికల ఫ్రంటు పేజీల్లో
అతని గురించి రాస్తారు
అంతటా వ్యాపిస్తున్నదేదో
అతని గొంతులో పలుకుతున్నది

"బాధ అందరిది
పీడన అందరిది
మట్టి మనిషే మానవుడు"
అని ఎలుగెత్తి చాటాలనిపిస్తుంది
ఊపిరాడడం లేదు
హాలులోంచి బయటపడ్డాను
ఒంటిమీద పడ్డ
కాడలేని పువ్వులను
దులిపేసుకుంటూ
మా ఊరివైపు నడవడం
ప్రారంభించాను.



## సెప్టెంబర్ నెల పురస్కారాలు



**ఇనుపరెక్కల వల**
కథకు: రూ.700/-
రచయిత : డా॥ ఎ. రవీంద్రబాబు

**నేలతల్లి పొత్తిళ్ల అంచున..**
కవితకు : రూ .500/-
రచయిత : సిహెచ్.వి. లక్ష్మి



సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

వ్యాసం : ఖాదర్ మొహియుద్దీన్ 'పుట్టుమచ్చ' ముస్లిం మైనారిటీ వాద తాత్వికత' రచయిత : షేక్. ఇబ్రహీం



ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం రూ. 500/- అందజేయబడుతుంది

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు. - ఎడిటర్



# అనామిక

- బి. కళాగోపాల్
9441631029

"**మా**స్టారూ...!" వెనుక నుండి ఓ అపరిచిత తీయని స్వరం పిలిచింది. నెల్లూరులో సాహితీసభను పూర్తి చేసుకొని హైద్రాబాద్‌కు వెళ్లే తొందర్లో ఉన్నాను నేను. గేటు దాటుతున్నవాడినల్లా గిర్రున వెనక్కి చూశాను. యాభైఐదేళ్ళ మహిళ. దళసరి గోల్డ్ ఫ్రేం కళ్ళజోడు. కుంకుమరంగు ఉప్పాడ చీర, మెడలో రెండు పేటల చంద్రహారం చూడగానే కల్గిన కుటుంబం నుండి వచ్చిన పెద్దావిడ అన్పించింది. "మాష్టారూ... మీతో ఓ నిమిషం మాట్లాడాలి" అందామె చిర్నవ్వుతో. " చెప్పండి" అన్నాన్నేను. ఓ వైపు పదిగంటలకు బయలుదేరే ట్రైనుకు లేటు అవుతుందేమో అన్న ఆందోళనను కనిపించనీయకుండా జాగ్రత్తపడుతూ "ఏం లేదండీ, మీకో చిన్న బహుమతి ఇదేమంత పెద్ద విలువైంది కాదు. కానీ మీ పట్ల ప్రేమతో, అభిమానంతో ఇవ్వాలనిపించింది" అంటూ తన బ్యాగు నుండి లేత బంగారువర్ణంలో ఉన్న శాలువాను తీసి నా చేతిలో పెడుతూ అంది. సహజంగా నా మాటల్లో చమత్కారాలెక్కువగా దొర్లుతాయి. వ్యాఖ్యాతను కదా! "ఇదో కొత్తరకం సన్మానం నాకు. ఇక్కడ ఎవరూ లేరు. సభ ముగిసిన పిమ్మట ఇప్పుడెందుకండి ఇదంతా..." అంటూ అభ్యంతరం చెప్పబోయాను. "ఎందుకు లేరు? అటు చూడండి చందన బ్రదర్స్ షాపులోకి వెళ్ళేవారు, వచ్చేవారూ, ఇలా చూడండి, పక్కన భోజనశాలలో భోం చేస్తున్నవారు, రోడ్డు మీద వెళ్లే వందలాది జనం. చుట్టూరా ప్రభంజనం. వీరంతా మనవారు కాదా? వీరందరి మధ్యలో మీరు నా చిరుకానుక స్వీకరించాలి. కాదంటే నాకు బాధగా ఉంటుంది మాష్టారూ!" అంది ఆమె బరువుగా. చివరిమాట మాట్లాడేటపుడు ఆమె గొంతులో తెలియని వేదన నన్ను కలచివేసింది. నిశ్శబ్దంగా ఆ శాలువాను స్వీకరించి అటుగా వెళ్తున్న ఆటో వైపు చేయి ఊపాను ఆపమన్నట్లుగా ఆమెకి వీడ్కోలు చెపుతూ.

నేనొక ప్రసిద్ధ ఉపన్యాసకుడను. వ్యాఖ్యాతను కూడా. నాకున్న పుస్తకాల పిచ్చి మరెవరికీ ఉండదని నా

నిశ్చితాభిప్రాయం. పాదరసంలా జారిపోతూ ఎక్కడ బుక్‌ఫెయిర్ పెడితే అక్కడికి వెళ్ళిపోతాను. ఒక పుస్తకం అచ్చులో రూపుదాలుస్తుంటే ఒక కాపీని నాకు ముందే పంపటం చాలామంది రచయితలకు రివాజు. ఎన్నో వందల సాహితీ సభల్లో అనర్గళంగా ఉపన్యసించాను. కొన్ని వందల పుస్తకాలకు సమీక్షలు రాశాను. శ్రోతలను ఆకట్టుకునేలా మాట్లాడడంలో నేర్పరినని విజ్ఞుల ఉవాచ.

ఆ రోజు ఉదయం విజయవాడలో సభ ఉంటే వెళ్లాను. కిక్కిరిసిన ఆడిటోరియంలో ఒక పుస్తకావిష్కరణ సభ అది. నా వ్యాఖ్యానంతో గ్రంధ పరిచయం గావిస్తూ ప్రేక్షకులను ఓసారి కలియజూశాను. మహిళల వరుసలో ఓ చివరగా ఆమె కూర్చుంది. నవ్వుతున్న కళ్ళతో నాకేసి చూసింది. ఆశ్చర్యపోయాను నేను. ఆమెకున్న సాహితీ పిపాస గొప్పదే అనుకున్నాను. అప్పటి నుండి అక్కడక్కడ సభల్లో ఆమె కలిసేది. కాని ఆమె ఎవరో? ఆమె గతమేమిటో? ఆ రోజు గనుక ఆ మీటింగ్‌కి నేను వెళ్లుండకపోతే నాకెప్పటికి తెలిసేవి కావు.



ఆ రోజు హైద్రాబాద్ త్యాగరాయ గానసభలో గ్రంధ కృతి స్వీకర్తలైన దంపతులకు సన్మానం. ఆ గ్రంధానికి తగిన ఆర్థిక సహాయం చేసిన పెద్దావిడగా నాకు ఆ రచయిత ఆమెను పరిచయం చేశాడు. అదే చిర్నవ్వుతో స్నేహ పూర్వకంగా నమస్క రించిందామె. సభ మొదలైంది. రచయిత విన్నపంతో ఆమె తన స్పందనను తెలియజేసింది. తనకు మొదటి నుండి పుస్తకాలంటే తగని పిచ్చి అని, అనేక గొప్ప పుస్తకాలను చదవాలని, గొప్పవాళ్ల సభల్లో పాల్గొనాలనీ, బుక్ ఫెయిర్‌లకు వెళ్ళాలని తనకు తరగని అభిలాష అని వెల్లడించింది. కాని తన కోరికలు కలలూ అన్నీ శాడిస్టు భర్త చేతిలో బుగ్గి అయ్యాయి అని, ఇన్నేళ్ల తన జీవితంలో ఆంక్షలే తప్ప ఆనందాలకు తావు లేదని, వేదన తప్ప బతుకులో తాను సాధించింది ఏమీ లేదని చెప్తున్నప్పుడు ఆమె కళ్లలో సన్నటి కన్నీటి పొర. కాసేపాగి ప్రారంభించింది. ఇప్పుడు తానెంతో ధనవంతురాలినని, ఇలా పుస్తకాల రచయితలకు ఆర్థిక సహాయం చేస్తున్నానని, ఆలస్యమైనా నా అభిరుచులను, ఆసక్తులను ఈ వయస్సులో తీర్చుకుంటున్నానని, ఈ యువ రచయిత రాసిన పుస్తకం తననెంతో ప్రభావితం చేసిందని ముగించింది. సభికుల హర్షధ్వానాల నడుమ సంతృప్తిగా సభా కార్యక్రమాలు ముగిసాయి. తిరుగు ప్రయాణమయ్యాను నేను.

ఇంటికి చేరగానే టేబిల్‌పై ఓ ఆహ్వాన పత్రిక. అందుకొని చూద్దును గదా! ఢిల్లీలో తెలుగు భాష దినోత్సవం సందర్భంగా కవి సమ్మేళనంలో పాల్గొనాలని సాదర సత్కారాన్ని అందుకొనాలని సారాంశం. ఎల్లుండే ప్రయాణం. ఆ ఏర్పాట్లలో తలమునకలై ఉన్నాను. పనిలో పనిగా ఢిల్లీ నగరాన్ని, ఆ చుట్టుపక్కల ప్రాంతాన్ని సందర్శించాను. చివరగా అందరం కల్సి సరదాగా తాజ్‌మహల్ వెళ్లాం. మొదటిసారి తాజ్ అందాన్ని దగ్గరి నుండి చూశా. మనస్సు, శరీరం తన్మయత్వంతో పరవశించాయి. తెల్లగా, మెరిసిపోతూ, ఠీవీగా వెన్నలీనుతూ యమున ఒడ్డున "ది తాజ్, ప్రైడ్ ఆఫ్ ఇండియా" నిజం చెప్పొద్దూ ! నాకు కన్నీళు ఆగలేదు. నా జ్ఞాపకాల పొరల్లో మళ్ళీ ఆమె కదలాడింది. ఆమెను చూడటం అదే చివరిసారి. ఆ రోజు సభా కార్యక్రమాలు ముగిసాక "మాష్టారు! మా యింటికి రండి, ఆతిథ్యాన్ని స్వీకరించండి" అందామె ఆప్యాయంగా. 'లేదండీ, మరెప్పుడన్నా.... ఈ రోజే తిరుగు ప్రయాణం సారీ!!" అంటూ సున్నితంగా అభ్యర్థనను తిరస్కరించాను. పోనీ పక్కనే గల హోటల్‌లో టిఫినైనా చేద్దాం రండి అందావె. చనువుగా తప్పేలా లేదనుకొని మొహమాటపడుతూనే వెంటనడిచా. టిఫిన్‌కు ఆర్డర్ ఇచ్చిందామె. ఇరువురం కబుర్లలో పడిపోయాం. కాఫీ తాగుతూ హఠాత్తుగా అందామె " మాష్టారూ! తాజ్‌మహల్‌ను ఎవరితో చూడాలి?" అంది. ఉలిక్కిపడ్డాన్నేను. ఇబ్బంది పడుతూ, అందరూ అనుకున్నదే చెప్పాన్నేను. "ప్రేయసి ప్రియులు లేదా భార్యభర్తలైతే తాజ్ సౌందర్యాన్ని ఆస్వాదించవచ్చు" అన్నాను. "కాదు మాష్టారూ, అందరూ అలాగే అంటారు కానీ తాజ్‌మహల్‌ను చూడాల్సింది క...న్నీ...ళ్ల...తో" అందామె ఉద్వేగంగా. కాసేపేమీ మాట్లాడలేకపోయాన్నేను. బిల్లు చెల్లించి, బయటకొచ్చామిద్దరం. "మరి మీ వారు?" అన్నాన్నేను ఆర్ధోక్తిగా. దీర్ఘంగా నిట్టూర్చిందామె... "ఆయన ఎన్నడో కాలధర్మం చేశారు మాష్టారూ, ఇన్నేళ్ల అణగారిన జీవితపు

పి. శ్రీనివాస్‌గౌడ్
9949429449

## ఓదార్పు



మాలో ప్రతిభ వుంది
ప్రముఖ కవులమని
మా కాలంలో మమ్మల్ని
ప్రజలు ప్రస్తుతించారు

మా నివాసాలు అణగిపోయాయి
మాకున్న గుర్తింపు స్వల్పం...
కూడు, గుడ్డకు నోచుకోక...
మమ్మల్ని సేవకులు కూడా అలక్ష్యం చేసారు
జీవిత ఉచ్ఛస్థితిలో..
మా ముఖాలు ముడతలు పడ్డాయి
మమ్మల్ని, మా కష్టాల గురించి
ఎవరు పట్టించుకుంటారు...?
ఒకరికొకరం మేం
మా సాహితీ ప్రతిభావ్యుత్పత్తుల్ని
మెచ్చుకుంటాం
గతించిన గొప్ప కవుల కవితలతోపాటు
మా కవితలూ కాలానుగుణంగా
తర్వాతి తరాలకు చేరతాయి
కనీసం మాకు
మమ్మల్ని కొనసాగించే వాళ్ళున్నారని
ఒకరినొకరు ఓదార్చుకుంటాం.

## రాత్రి.. మెలకువగానే....



చిత్తడినేల వ్యాపించిన
నిర్జనప్రదేశంలో
వెన్నెల చొచ్చుకొని వస్తున్న
వెదురు వృక్షాల కింద నిదురించాన
మంచుబిందువులు
పొగమంచుగా మారాయి
తారలు ఒక్కొక్కటే మాయమయ్యాయి
మిణుగురులు మాత్రం మిగిలివున్నాయి
యుద్ధం - దాని పర్యవసానాల్ని కంటుంది
బాధపడి ప్రయోజనం లేదు
మెలకువగానే
దీర్ఘరాత్రిని గడిపేసాను

*దు-ఫు తంగ్ రాజవంశ కాలంలో పేరుగాంచిన కవీంద్రుడు. చైనాలో ఉద్భవించిన శ్రేష్ఠమైన కవుల్లో ఒకడు. యుద్ధం వల్ల తీవ్రమైన ఇబ్బందులు పడ్డాడు. అనేక యుద్ధ వ్యతిరేక కవితలు రాసాడు.*



బందిఖానా నుండి విడివడి ఇప్పుడిప్పుడే కొత్త రెక్కలు తొడుక్కుని జీవించటం నేర్చుకుంటున్నా, ఎక్కడో చదివిన ఒక షాయరీ గుర్తుకొస్తుంది మాష్టారూ. 'ఇస్ దునియామే ఇత్ నా గమ్ హై, మేరా గమ్ కిత్ నా కమ్ హై' అన్నట్టు పెను విషాదంలో నాదో చిన్న కష్టం. బాధను మరవటానికి సాహిత్యంలో ఆనందాన్ని వెతుక్కుంటున్నాను. ఇన్నేళ్లు గడప కూడా దాటలేదు. ఇప్పుడు సభల్లో పాల్గొంటే ఒంటరితనం, దిగులు రెండూ నా చెంత చేరవు. నాలా ఎందరో ఉన్నారేమో అన్న భరోసా" అందామె స్థిరంగా మనసులో ఆమెను అభినందించకుండా ఉండలేకపోయాను. చక్కని సాహితీ పిపాస ఉత్తమ వ్యసనమని, గొప్ప పుస్తకాలు మన అంతరంగాన్ని మేల్కొలుపుతాయని, అది ఎంతోమంది జీవితాల్ని ప్రభావితం చేయగలదని చెప్పటానికి ఆమె ఉదాహరణగా నా ముందు నిల్చింది. ఆ తర్వాత మరెన్నో సభల్లో పాల్గొంటున్నా గానీ నాకైతే ఇంతవరకు ఆమె కన్పించలేదు. మాటల్లో పడి ఆమె పేరు అడగటం మర్చిపోయానో లేక ఆమె చెప్పినా నా మతిమరుపు వలన గుర్తు పెట్టుకోలేకపోయానో తెలీదు. ఆమె ఇప్పుడు ఎక్కడుందో ఎలా ఉందో? ఏదో పుస్తకంలో చదివిన కవితా పంక్తులు నాలో లీలగా కదలాడాయి. "ఆమె ఎప్పుడూ నిద్రకూ, మెలకువకూ నడుమ ఎక్కుపెట్టిన ఎదురుచూపులా ఉంటుంది. అంతెందుకు ఆమె ఎప్పుడూ ఆమెలా... ఉంటుంది". నిజమే, మనుష్యులందరూ భిన్న వ్యక్తిత్వాలు, భిన్న అభిరుచులు, ఇప్పుడు తాజ్‌ను తాకుతున్నప్పుడు సూదంటురాయి లాంటి ఆమె జ్ఞాపకాలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేయసాగాయి. రఫీ పాట నా గుండె గదిలో జొరబడింది తీయగా 'నమూ చుపాకే జియె ఔర్ న సర్ ఝుకాకే జియో, గమోంకా సాత్ భీ చాహెతో ముస్కరాకే జియో'. కొన్ని పరిచయాలను, కొందరు వ్యక్తులను మరువలేమేమో...? మునివేళ్ళతో సుతారంగా స్పృశిస్తున్నాను తాజ్‌ను. నా కన్నుల్లో మసకగా అలుక్కుపోతున్న తాజ్ అందం నా జ్ఞాపకాల పొరల్లో బరువుగా అనామిక రూపం....






# అజ్ఞాన తిమిరాన్ని విచ్ఛిన్నం చేసే విద్యుత్తే విద్వత్తు

- డా॥ సోమసుందర్ ఆవంత్స

మృత్యుఘంటికలు అనే కవితతో పెరుగు రామకృష్ణ తన కవితాసంపుటి "పూలమ్మిన ఊరు"ను మొదలుపెట్టాడు. మనిషి బ్రతుకు మహిమాన్వితమైనదే సందేహం లేదు. చరిత్ర పొడవునా ఎన్నో మహత్తర కార్యాలు సాధిస్తూ సాగుతున్న మానవుడు మహిమాన్వితుడే. పైరూ పంటా వాటితో అనుబంధం మనిషికి విడదీయలేని సంపద. ముందుకు నడిపించే జీవిత బంధం. శతకోటి వర్ణాలతో భాసిస్తున్న ఎన్ని పుష్పాలో, ఆ మానవుడి కోసమే. ఆ పూవుల సమూహాల నడుమనుంచి ఒరుసుకుంటూ పారేగాలి ఎంత పవిత్రమైనదో మనిషికే తెలుసు. కాని, రాత్రికి రాత్రి ఆ సస్యశ్యామలమైన పొలం రొయ్యల చెరువుగా మార్చబడింది. దుఃఖాకులమై ఘూర్ల్లిల్లింది. కన్నులలో పడిన కాంక్షాతుందిల ఛాయలు కంటి చూపునే మసకబారుస్తున్నాయి. వ్యాపార పారావారం సౌందర్యపూరిత హాళిక హృదయాన్ని పరిమార్చింది. మనిషి స్వార్థం మంచితనాన్ని మ్రింగి భద్రకాళిని ప్రత్యక్షం చేస్తోంది. దానికి గుండెల మోతలు హితం కాదు. కాసుల మోతలు తప్ప.

చీకటి పల్లకీలో అనే కవితలో - చిరిగిపోయిన దేహాల్ని చూసినప్పుడల్లా నిన్ను, నీవు అంగార తల్పం మీద నెట్టుకొంటున్నట్లు పాపం మానవుడు గుర్తించుకోవడం లేదు. చీకటిపల్లకీలో ఊరేగుతున్న మనిషిని మేల్కొల్పడానికి ఇక్కడ ఎవరూ లేరు... విశాలమవుతున్న "ఈ విశ్వపటలం మీద ఇమడలేక, మళ్ళీ తల్లి గర్భం వెతుక్కుంటున్న కాందిశీకుణ్ణి నేను" అని ఆక్రోశిస్తాడీ కవి.

ప్రేమతో హృదయాలను వెలిగించే ఒక అఖండదీపం కోసం కవి నిజంగానే ఆర్తి చెందుతున్నాడు.

కలలు చెక్కిన శిల్పం అనే కవితలో తామరాకుల మీది కోరికల బిందువులు నా మనసుని మార్మికం చేసినప్పుడల్లా "మా అనురాగ శిఖరాగ్ర సంగమాల ప్రణయలీలా విలాసపర్వం" నువ్వే జ్ఞాపకం వస్తావు. నీ జ్ఞాపకాలే నాకు జీవితమై జీవితాతీత మార్మిక ఆనందాల్ని ప్రసాదిస్తాయి అంటూ ఒక అనుభూతిని ప్రశంసిస్తాడు.

రాత్రికి అర్థం అజ్ఞాన తిమిర ధ్వాంతాలను చీల్చివేసే విద్యుత్‌వంటిదే. విద్వత్తు, మేఘాలు ప్రసాదించిన జలధారల నుంచి ఉత్పత్తి అయింది విద్యుత్. అలాంటి విద్యుత్‌ను శక్తిమయం చేసే కృషి కార్మికులదే. ప్రాణాల్ని విద్యుత్తీగలుగా మార్చి బ్రతుకుల్ని వ్రేలాడదీసుకుంటారు కార్మికులు. రాత్రికి పరమార్థం చేకూర్చేది విద్యుత్తే అంటూ మనకందరికీ తెలిసిన

విద్యుత్తు గురించి మనమెవ్వరమూ తేల్చుకోని సత్యాలను వ్యక్తం చేస్తాడు ఈ కవి.


పెరుగు రామకృష్ణ

నింగీ నేలా నీవైతేనే - సకల జనుల జీవరహస్యం సంపదలోనే దాగున్నప్పుడు పునాదులు ధ్వంసం అయ్యాక ఏ జీవన సౌధాల్ని నిర్మించదలచుకున్నావ్" అంటూ చక్కని ఊహలతో సాగి మనిషనే మానవత్వం ప్రతిబింబించేందుకు నీలాకాశం కావాలి అంటాడు.

ఒక శతాబ్దపు పులికింత అనే కవితలో జన గణ మన గురించి, దాని హృద్యమైన శిల్పం గురించీ గొప్పభావాలతో కీర్తిస్తాడు రామకృష్ణ. ఆ గీతాన్ని ఈ స్వతంత్ర్య భారతిని పరిరక్షించడం కోసమే తాను ఎన్ని జన్మలైనా ఎత్తడానికి సంసిద్ధంగా ఉన్నానంటాడు.

మన ప్రపంచం ఏకోదరుల నివాస గృహం, దాన్ని ఎవరు ధ్వంసం చేద్దామన్నా మనలో ఒక్కరూ ఒప్పుకోరు అంటూ హృద్యంగా చెబుతాడు.

అక్షరఖడ్గం - అనే కవితలో దుఃఖాన్ని క్రోధాకోరు అంటూ హృద్యంగా చెబుతాడు. క్రోధాన్ని ప్రేమని ఒకే మూటలో దాచగలడు కవి. అసహనం సముద్రమై ఎదురుపడినా, నిశ్చలంగా గర్వంగా నిలవగలడు అంటూ ఒక అక్షర స్వర్గంలోకి జాతిని మేల్కొల్పుతాడు.

మత్స్యకారుల జీవితం నిరంతరం మహా సముద్రముతో యుద్ధానికి ఆయుత్తమై ఉంటుంది. నడి సముద్రముపై లోతులో తెడ్డు ఊపుతూ చిరునావల్లో ప్రయాణం చేస్తూ బ్రతుకునీ పడవనీ, సర్వాన్నీ సముద్రానికి శరణం అంటూ అప్పగించిన నీ శౌర్యానికి జోహార్లు అర్పించకుండా ఉండలేము. కవి హార్థికంగా జోహర్లర్పించడానికే ఈ కవిత రాశాడు.

మనిషి శబ్ద సమూహాన్ని విడువడం లేదు. పర్యావరణాన్ని నడి రోడ్డుపై హత్య చేస్తున్న శబ్ద ఖననాన్ని కోరుకుంటున్నాను" అంటున్నాడు. కవికుండే కక్ష్య నవీనంగా ఉంది. నిజమే శబ్దరాహిత్యం మృత్యులక్షణమే. అలా అనుకునే ఈ లోకాన్ని వికృత ధ్వని సమూహంతో నింపుకున్నాడు మనిషి.

అతడు ఎన్ని కవితలు భౌతిక స్వరూపాలనో సందర్శిస్తాడు. వాటి ఆత్మలు మాత్రం అతడి పట్టుకు దొరకక తప్పించుకు తిరుగుతుంటాయి.

సరిహద్దు రేఖ గురించి దేశాల నడుమ పోరాటాలన్నీ అనుస్యూతంగా జరుగుతూనే ఉంటాయి. అలాంటి రేఖలలో మెఖ్‌మోహన్ రేఖ ఒకటి. ఇది భూమి మీద కనిపించే రేఖ కాదు. కేవలం భావరేఖ. దీన్ని హిమాలయాల్లో చైనా దేశానికీ, భారతదేశానికీ నడుమ సరిహద్దు రేఖగా ఏనాడో సామ్రాజ్యవాదులు ఏర్పరిచారు. యుగాలు గడిచాయి. సామ్రాజ్యాలు కూలిపోయాయి. కాని, ఆ రేఖే వివాదం కలిగిస్తోంది.

> *నింగీ నేలా నీవైతేనే - సకల జనుల జీవరహస్యం సంపదలోనే దాగున్నప్పుడు పునాదులు ధ్వంసం అయ్యాక ఏ జీవన సౌధాల్ని నిర్మించదలచుకున్నావ్" అంటూ చక్కని ఊహలతో సాగి మనిషనే మానవత్వం ప్రతిబింబించేందుకు నీలాకాశం కావాలి అంటాడు.*

తాత్త్వికంగా భౌతికవాదులయిన చైనీయులు ఈ భావరేఖ కోసం గుడిసుళ్ళు పడుతున్నారు. రెండు మహత్తర దేశాలపైన స్నేహం కోసం కాక సమరం కోసం దుస్తంత్రం రూపొందిస్తున్నారు. అది నేపథ్యం ఈ కవితలో శ్రీ రామకృష్ణ రెండు దేశాల ఆంక్షల్ని జయించాలని, భవిష్యత్ మానవుడు శాంతిని నిర్మించాలనీ సందేశిస్తున్నాడు. "రక్తజలపాతాల మధ్య విద్వేషాగ్ని లావా ప్రవాహాల గుండా ఓ శాంతిమార్గాన్ని నిర్మిద్దాం - అని మనసారా కోరుతోంది. ఆయా మార్గాలలో శాంతిని నిర్మించడం మామూలు విషయం కాదు. అదెంత ప్రమాదకర విషయమో స్థూలదృష్టితో ఆలోచించినా అర్థమవుతుంది. దారిపొడుగునా సమానంగా పంచుకోవలసిన రక్త స్పర్శలన్నీ ఉన్నాయి. నాటి హ్యుయాన్‌సాంగ్ ఈనాటి సమ్యక్‌సేన్ గాంధీలు ఎంత ఆత్మీయులు? ఇట్టి పవిత్ర చరిత్రను ఏమరక ముందుకు సాగడమే వర్తమాన చరిత్రకు పసిడి చేలాంచలం. అజ్ఞానంలో పడి గతంలో మన రెండు దేశాలు కూడా ఎంతమందో ఆత్మీయుల్ని పోగొట్టుకున్నాం.

చిరునవ్వుల హరివిల్లు ముక్కలతో పాటకీ, మాటకీ మధ్య రాగం తప్పినా, తాళం తప్పినా నియమ భంగమే కదా! కొత్త మానవుడు కొత్త భాషను నిర్మించుకోవాలి. అప్పుడు పాత కుళ్ళు చిహ్నాలు కరిగిపోతాయి. కనక ఉభయ దేశాల మనుషులూ కలిసి ఒక సజీవ చిహ్నంగా గులాబీ చెట్టును, నాటుదామని అదే ఆగమలోక శాంతికి ఆరోగ్యకర ఔషధంగా

తనరారగలదని హెచ్చరిస్తున్నాడు కవి. ఈ మట్టి ఏ దేశానిది? ఏకాకిత్వంలో ఏ దేశమూ - హరిత స్వప్నంగా వికసించలేదు. నేలమీద నీ అడుగులే నీ చరిత్ర - అని సహజ సాహస మంత్రోపదేశం చేసిన కవి మానవతావాదే. ప్రపంచ ముఖ చిత్రంపై కొత్త మనిషి రూపురేఖలు రచించుకో అని సర్వదేశాలకూ సర్వ మానవాళికీ ఆలోచనీయమైన నవ సందేశమిస్తున్నాడు. సాధారణమైన మానుష భాషలోనే ఆ సందేశం ఉంది తప్ప దేవభాష కోసం కాదు. నూత్న మానవుల ఆవిర్భావానికి సమష్టిగా మానవులు ఆయత్తం కావలసి ఉంది. అతనికి పనికివచ్చే అనుకూల వాతావరణాన్ని తీర్చిదిద్దవలసి ఉంది.

ఒక మహా ప్రపంచపు విశాల హృదయం విశ్వ తీరాల ద్వారాలు తెరచి నిరీక్షిస్తుంది. నీకోసం విద్వేషపు లావాలా ప్రవహించడం మాని నిరీక్షిస్తుంది. నీ కోసం". మనిషిని మలచడానికి నడపడానికీ కొత్త మానవతా సూత్రాలు మాత్రమే పనికొస్తాయి. పాత పట్టిన సామ్రాజ్యవాదుల నియంత్రణలు, కాని, ధనస్వామవాదుల ఖడ్గ ప్రీతి కానీ పనికిరాదు. కొత్త సూత్రాలలో కొత్త ప్రతిపాదనలు నిర్మించుకుందాం. అని ప్రేమమయ పలుకులు పలుకుతున్నాడు.

*మనిషిని మలచడానికి నడపడానికీ కొత్త మానవతా సూత్రాలు మాత్రమే పనికొస్తాయి. పాత పట్టిన సామ్రాజ్యవాదుల నియంత్రణలు, కాని, ధనస్వామవాదుల ఖడ్గ ప్రీతి కానీ పనికిరాదు. కొత్త సూత్రాలలో కొత్త ప్రతిపాదనలు నిర్మించుకుందాం. అని ప్రేమమయ పలుకులు పలుకుతున్నాడు.*

జయ జయహో - అనే కవితలో ఆస్కార్ విజేత ఎ.ఆర్. రెహమాన్ అనే సంగీత దర్శకునికి అత్యద్భుతమైన నివాళి చెప్పాడు అతడు సంగీత లోకంలో స్వేచ్ఛా విహంగమై సంచరిస్తున్నవాడు అన్నాడు. మనిషే అక్షరం - లోకం పురోగమిస్తోంది అన్నప్పుడు మనకి రెండు క్రియలు ద్యోతకమవుతాయి, 1) సమూహము 2) ఏకాంతము ఈ రెండూ మానవస్వరూపంలోనివే. తాను కవిగా శూన్యమయ్యే క్షణాలుంటాయి. ఉత్త గొప్పలు చెప్పుకునేవాళ్ళు లేరని దబాయించవచ్చు. కానీ, అలాంటి తీరిక తన మనసుకు వచ్చినపుడు దానిమీద బరువైన అక్షరాన్ని పెడతాడు కవి. ఆ అక్షరం చాలు. ఒక సమస్తత్వాన్ని విశ్వ రహస్యాన్ని విపాటనం చేసే కవితగా ఆవిర్భవిస్తుంది. ఆ క్షణమే అద్భుత సంచలనం. దాన్ని చిత్రిస్తున్నాడు కవి. ఈ కవితలో దాని లయను, తాళగతినీ సంగీత సౌభాగ్యాన్నీ పట్టుకుని తెచ్చుకున్నాడు. తన ఆహార్యంగా మలచుకున్నాడు. ఆ జ్వలనమే తన ప్రవాహమని ఇంక ఎవరు చెప్పుకోగలరు! అక్షరం సముద్రంగా మారినపుడు, తానా సముద్రాన్ని మోస్తూన్న మానవుడే అంటూ ఈ కవితలో అద్భుత భావనా రింఛోళిని సమకూర్చుకున్నాడు రామకృష్ణ. అందుకే నాకు ఆత్మీయుడయ్యాడు.

కవులు ఆకస్మికంగా పుట్టరు. క్రమ వికాసాలతో రూపొందుతారు. సరిగ్గా అలాగే రామకృష్ణ నాలుగేళ్ళలో నాలుగు దిక్కులుగా పరిచిన అక్షరాన్మయాన్ని కవితలుగా మంత్రించాడు. సరస్వతిని ఆమంత్రించాడు. సారస్వత మంత్ర శక్తి గల కవిత నిటారుగా నిలిచి సాగుతుంది. సోలిపోదు. మిత్రులు పెరుగు రామకృష్ణ నాకు పరిచయమయిన ఐదేళ్ళలో కవిగా ఎదిగి ఎదిగి శరత్‌జ్యోత్స్నలా గట్టిపడిన గడ్డ పెరుగులా మెరుస్తున్నాడు. పూలమ్మిన ఊరు పేరున ప్రచురించిన ఈ కావ్యంలో మొత్తం 41 కవితలున్నాయి.

బంగారం ధర అంతర్జాతీయ విపణి వీధిలో నిరంతరం ఆకాశగమనం చేయడంతో మన దేశీయ బంగారు వస్తువులు తయారు చేసే శిల్పుల వర్గం కూలిపోయింది. వాళ్ళ హస్తనైపుణ్యం కొరగాకుండా పోయింది. ఇది గొప్ప విషాదం. ఇది సాధారణంగా మేధావులెవరూ పట్టించుకోని సంఘటన. కవి దాన్ని చక్కగా వర్ణించాడు కవి కాసులు అనే కవితలో పరావర్తనం అనే కవితలో వాడి పారేసే సంస్కృతి దురాక్రమణలో ఈ సంస్కృతి ప్రపంచంలో నేడు అనివార్యమయిన బూర్జువా సంస్కృతిగా వ్యాపించి సర్వ రంగాలను అదుపు చేస్తోంది. దేశీయ వస్తువులన్నీ దారి మారిన దయనీయ వైనం. ఒక మమతల లోకం చూడ్డానికి ఈ దారులేవీ ప్రజలకు సహకరించవు.

రక్తం రంగు కొత్తగా చెప్పవలసింది కాదు. అయితే రక్తంలోంచి మనిషి పరిమళం వస్తున్నదా? లేదా అన్నదే సమస్య. మానవుడు సంచరించే నేలమీద అతని సంతకం కనిపిస్తూనే ఉంటుంది. బ్రతికుండగానే అమ్మను కాటికి మోసినప్పుడే నీ భుజాలనుంచి కుళ్ళిన శవాల కంపు మొదలైంది అంటాడు. మనిషిలోని అమానుసత్వం వాడు జన్మనిచ్చిన

## పొల్లు మాటలిక చెల్లు

- నూనెల శ్రీనివాసరావు
9492970231



ఏఊరెళితే
ఆ ఊరో పాట
అయ్యగారికిది
అచ్చొచ్చిన బాట
నిన్న ఆంధ్రా
నేడు బీహార్
ఎక్కడైనా మాటేకదా
పెదవులపై దొర్లిస్తే చాలు
ఓట్లే ఓట్లు
సీట్లే సీట్లు
అపై ఎక్కడి మాటలక్కడ
కొక్కానికి తగిలించేయడం
చల్లగా చెక్కేయడం
పూటకో డ్రస్సు మార్చినట్లు
గడియకో మాట
నవ్విపోదురుగాక
నాకేటి సిగ్గు
ఇదో బ్రాండ్ ఇమేజ్
ఎంతమాట
ఎంతమాట
ఎర్రి జనమని
ఏదైనా వాగేస్తామని
పదే పదే
అవే మాటలు
అవే వరుసలు
విసా విసా విసిగేసి
కత్తులు నూరుతున్నారు
జనం
రేపిచ్చే తీర్పుకదో
తార్కాణం
మరి మారతావో
కార్పొరేట్ల భజనల్లో
మునిగితేలతావో
తేల్చుకో తక్షణం

## అగమ్య గమ్యం...!!

- మాతంగి దిలీప్ కుమార్
9848134139

స్వేచ్ఛ సాధించామంటే
భావాలను బయటపెట్టొచ్చని
ఆలోచనలు ఆరబొయ్యొచ్చని
ఆదరింపులు పొందొచ్చని
ఆశపడ్డ...
స్వాతంత్ర్యం వచ్చిందంటే
సమానత్వం వచ్చేసిందని
ఒక్కటిగా ఉండొచ్చని
అనుకున్నా...
మనమంతా
భారతీయులమంటే
మనువాదం
తోకముడిచిందని
మతభేదం మనస్సుల్ని
వదిలిందని
కులతత్వం కాటికెల్లిందని
భ్రమపడ్డా...



68 సం॥ గడచినా
పేదల వ్యథా తప్పలేదు
కుల క్రౌర్యం తగ్గలేదు
బానిసలన్న భావం పోలేదు
మరెంతకాలం మార్పులొచ్చే
మార్గం దొరకలేదు
ఇదీ నా దేశం
ఎన్నటికితీరేను...
ఎప్పటికి చేరేను...
అభ్యుదయాల వాస్తవ గమ్యం!!!

తల్లితండ్రుల విషయంలో ఎటువంటి ప్రవర్తన చూపించాడో దానిమీదే ఆధారపడుతుంది. తల్లితండ్రులను ప్రేమించ లేనివారు మనిషిగా ఈ లోకం నించి మమతను ఆపేక్షించలేరు. అలాంటి మనుషుల్లో మనిషి మరణించిన చావుకేక వినిపిస్తుంది. స్తబ్దాటవిలో మిణుగురు ఆగిపోయింది నీలో అని అమానుష ప్రవర్తనగా మనిషిని శపిస్తాడు కవి, 'నీలో ప్రాణమనే లక్షణం మరణించడానికి ముందే, నేలతల్లి చిరునామా మారిపోవడానికి ముందే నువ్వు ఫీనిక్స్‌లా అగ్ని స్నానం చెయ్యాలిప్పుడు అని అమానుషత్వానికి అర్పితమై పోయిన మానుషత్వాన్ని ఇంత తీవ్రంగా నిందించిన కవి వేరొకరు కనిపించరు.

పూలమ్మినఊరు అనే కవిత ఈ కవితా సంకలనానికి టైటిల్ పేరుగా పెట్టాడు ఈ కవి. ఈ కవితను పరిశీలిద్దాం. ఈ కావ్యం శీర్షికకు వేసిన చిత్రం ఆధునిక చిత్రకళకు సంబంధించిన ఒక అవాగ్మానస గోచరమైన రంగులా ఉంది.

ఆధునిక బురదలోంచి కమలాలే పుడతాయి. రెండు చేతులూ పది కాలాలపాటు కదిలినపుడు వోటి కుండల్నే కాదు. ప్రాణాలు నిల్పే నాటి కుజాల్ని కూడా చరిత్ర చేతుల్లో పెడతాయి. రేగడిముంతల్లో పేరిన మీగడ పెరుగు, నల్లకుండల్లో వండిన బేడిస చేపకూర వంటి మానవ నిర్మితాలు ఆరోగ్యాన్నీ ఆనందాన్నీ ప్రసాదిస్తూ సాగుతాయి.

పరాయీకరణ చెందిన ప్లాస్టిక్ బ్రతుకు గొప్ప నాగరికతను సాధించినట్టు మృణ్మయ పాత్రను వెక్కిరిస్తుంది సజీవ శరీరంపై స్రవించే స్వేద బిందువుల్ని మరీచికలుగా మార్చింది. ఆధునిక నాగరికత. ఇట్టి స్థితిలో తానొకనాడు పూలమ్మిన నగరంలో ఏవీ అమ్ముకోడానికి పాలుపోక నెత్తిన చెంగేసుకుని తిరుగుతున్నాడు. ఆధునిక మానవుడు, ఇతని దైన్యాన్ని వర్ణిస్తూ, సూచన ప్రాయంగా వివరిస్తూ శ్రీ పెరుగు రామకృష్ణ పూలమ్మిన ఊరు అనే కావ్యాన్ని మనకందిస్తున్నాడు కవి. ఈ కవితను సర్వోత్తమమైనదిగా భావించినందుకు ఈ శీర్షికనే తన కవితా సంకలనానికి పెట్టాడు.

ఒక చిరకాల స్వప్నం పురుడు పోసుకునే శుభఘడియ కోసం కవితా హృదయంతో నిరీక్షిస్తున్నాడు పెరుగు రామకృష్ణ.



కల్నల్ మెకంజీ, అతని సహాయకులతో

# తెలుగు భాషా చరిత్ర పరిశోధనకు మెకంజీ కైఫీయత్తులు మణిదీపాలు

*మెకంజీ సర్వే ఉద్యోగి కావున హైదరాబాదు, మైసూరు మొదలైన ప్రాంతాలలో మారుమూల ప్రాంతాలకు తిరుగుతూ, చరిత్రకు కావలసిన సామగ్రిని సేకరిస్తూ ఉండేవాడు. ఈ కార్యక్రమంలో భాగంగా ఆయా గ్రామాలలో ఉండే గ్రామ కరణాలచేత "కైఫీయత్తుల"ను వ్రాయించాడు. ఒక వ్యక్తి తన జీవిత కాలంలో ఇంత సేవ చేయడం చరిత్రలోనే ఒక అపూర్వమైన ఘట్టం.*

**- సి.శివారెడ్డి**
**9440859872**

**జ**న్మతః ఆంగ్లేయులు అయినప్పటికీ, పరిపాలనలో భాగంగా భారతదేశానికి వచ్చినప్పుడు, ఇక్కడ సంస్కృతి, సంప్రదాయాలకు, సాహిత్యాలకు ముగ్ధులై, తెలుగుజాతికి మేలుచేసిన మహనీయులు కొందరు లేకపోలేదు. వారిలో ముఖ్యంగా బెంజమిన్ షుల్ట్జ్, విలియం కేరే, కాంబెల్ దొర, డా.కెల్వెల్ దొర, కోల్‌బ్రూక్, సి.పి.బ్రౌన్ మొదలైనవారున్నారు. ఈ కోవకు చెందినవారే "కల్నల్ కాలిన్ మెకంజీ"(1753-1821).

మెకంజీ స్కాట్లండుకు పడమరగా ఉన్న లూయియీ అనే ద్వీపంలో స్టార్నొవే అనే గ్రామంలో క్రీ.శ.1754 లో జన్మించాడు. తల్లి బార్బరా మెకంజి, తండ్రి మర్డొక్ మెకంజి. తండ్రి చిన్న వ్యాపారాలు చేస్తూ తన గ్రామంలో పోస్టు మాస్టరుగా పనిచేస్తుండేవారు. 1810 - 1815 ప్రాంతంలో మెకంజీ మద్రాసు ప్రాంతానికి సర్వేయర్ జనరల్‌గా నియమింపబడినాడు. గణితశాస్త్రజ్ఞుడైనప్పటికీ, భారతీయులు మత సాంఘిక సాహిత్యాలపై ఆసక్తి కల్గివుండడంవల్ల వాటిని గూర్చి తెలుసుకోవాలనే అభిలాష ఎక్కువగా ఉండేది. ఆ కారణంచేతనే 1796 లో అతనికి ఏలూరి నివాసియైన కావలి వెంకటబొర్రయ్యతో స్నేహం కుదిరింది. బొర్రయ్య(1776-1803) సహాయంతో తాను భారతీయ విజ్ఞానసౌధంలో తొలి అడుగువేశాడు. మెకంజీ తన సొంత డబ్బును కర్చుచేసి గ్రామ గ్రామానికి తిరుగుతూ వందలకొలది పురాతన తాళపత్రగ్రంథాలను, శాసనాలను సేకరించి, బొర్రయ్య సాయంతో వాటిని పరిశోధించి, దాదాపు 14 భాషలలో 16 లిపులలో ఉన్న 1568 గ్రంథాలను, 264 సంపుటాలలో ఉన్న 2070 స్థానిక చరిత్రలను, 77 సంపుటాలలో సంకలనం చేసిన 8076 శాసనాలను, 6218 నాణేలను, 2630 శిల్ప చిత్రాలను, 106 విగ్రహాలను, 79 పురాతన భవనాల ప్రతిరూపాలను, 40 పురాతన శిథిలావశేషాలను సేకరించి, వాటిలో ఉన్న విషయాలను గూర్చి "ఏషియాటిక్ రీసెర్చెస్", "రాయల్ ఏషియాటిక్ సొసైటీజర్నల్", "ఓరియంటల్ మాన్యుయల్ రిజిస్టర్" మొదలైన వాటిలో ప్రకటించాడు. మెకంజీ సర్వే ఉద్యోగి కావున హైదరాబాదు, మైసూరు మొదలైన ప్రాంతాలలో మారుమూల ప్రాంతాలకు తిరుగుతూ, చరిత్రకు కావలసిన సామగ్రిని సేకరిస్తూ ఉండేవాడు. ఈ కార్యక్రమంలో భాగంగా ఆయా గ్రామాలలో ఉండే గ్రామ కరణాలచేత "కైఫీయత్తుల"ను వ్రాయించాడు. ఒక వ్యక్తి తన జీవిత కాలంలో ఇంత సేవ చేయడం చరిత్రలోనే ఒక అపూర్వమైన ఘట్టం.

'కైఫా' అనే పారశీక పదానికి 'స్థానిక చరిత్ర' అని అర్థం. దీనికి స్త్రీలింగ రూపమే 'కైఫీయత్'. గ్రామస్థాయి నుండి దేశ స్థాయి వరకు ఆయా ప్రాంతాల విశేషాలను గూర్చి ఒక ప్రత్యేక రచనే 'కైఫీయతు'గా నిర్వచించవచ్చు. ఈ పదానికి కథ – వృత్తాంతం – హకీకతు – పారికత్తు – యాదుదాస్తు – అర్జిదాన్తు అనే పదాలు పర్యాయ పదాలుగా ప్రయోగింపబడ్డాయి. మొట్టమొదట సాహిత్యంలో చాటువులు, కావ్యావతారికలు, శాసనాలు వంటివి స్థానిక చరిత్రను తెలుసుకోడానికి ఆధారాలుగా ఉండేవి. బహమనీ సామ్రాజ్యాధినేతలు, కుతుబుషాహీ ఆసఫ్‌జాహీ ప్రభువులు తమ పరిధిలో ఇటువంటి చారిత్ర రచనలకు చేయూతనిచ్చారు. విదేశాల నుండి వచ్చిన రాయబారులు, యాత్రికులు, స్థానికులు మొదలైనవారు పారసీక భాషలో ప్రఖ్యాతిగాంచిన చారిత్రిక గ్రంథాలను రచించారు. వీటిలో స్థానికమండల, గ్రామాల చరిత్రలు సందర్భానుసారంగా చేర్చబడినాయి.

*ఆంగ్లేయుల పరిపాలనాకాలంలో సంస్కరణలను ప్రవేశపెట్టి ప్రతి మండలానికి సంబంధించిన చరిత్రను రాయడానికి స్థానికులను, గ్రామాధికారులను, జమీందారులను మొదలైన అధికారులను ప్రోత్సహించారు. కర్నల్ కాలిన్ మెకంజీ దొర సర్వేయరు జనరల్‌గా ఉన్నప్పుడు ఈ కార్యం రూపుదాల్చింది.*

ఆంగ్లేయుల పరిపాలనాకాలంలో సంస్కరణలను ప్రవేశపెట్టి ప్రతి మండలానికి సంబంధించిన చరిత్రను రాయడానికి స్థానికులను, గ్రామాధికారులను, జమీందారులను మొదలైన అధికారులను ప్రోత్సహించారు. కర్నల్ కాలిన్ మెకంజీ దొర సర్వేయరు జనరల్‌గా ఉన్నప్పుడు ఈ కార్యం రూపుదాల్చింది. ఈ ఫలితంగానే కైఫీయతుల రచన ఆవిర్భవించింది. జమీందారులు, అధికారులు, గ్రామాధికారులు, కరణాలు, నియోగులు మొదలైనవారు కైఫీయతులను రచించి మెకంజీగారికి పంపవలసిందిగా ఆదేశాలు జారీచేయబడినాయి. మెకంజీ వాటిని సేకరించి, వాటిలో కొన్ని సవరణలు చేసి తిరిగి వ్రాయబడిన వాటిని "మెకంజీ కైఫీయతులు" అని పిలిచేవారు. ఇవన్నీ దాదాపు 60 సంపుటాలలో ఉన్నాయి. వీటిలో శాసనాలు – విన్నపాలు – అర్జీలు మొదలైన అంశాలు ఉన్నాయి.

కైఫీయతుల రచనలో గ్రామాధికారులు, కరణాలు, నియోగుల పాత్ర ఎక్కువగా ఉన్నట్లు కనబడుతుంది. కైఫీయతులు కొన్ని చిన్నవిగానూ, మరికొన్ని పెద్దవిగానూ ఉంటాయి. కొన్ని కేవలం 5 లేక 6 వాక్యాలు మాత్రమే రచింపబడివుంటే మరికొన్ని 15 పేజీల వరకు వ్రాయబడివుంటాయి. వీటిలో ఉండే సారాంశం మొత్తం పరిశీలిస్తే, వాటిని క్రింది అంశాలు క్రోడీకరించవచ్చు.

ప్రారంభంలో మెకంజీ దొరను ఉద్దేశించి సర్వేయర్ జనరల్ వ్రాసిన కొన్ని వాక్యాలు కనబడతాయి. వారి ఆదేశాన్ని అనుసరించి కైఫీయతులు రచించి పంపుతున్నట్లుగా కొన్ని వాక్యాలు కనబడతాయి. కొన్ని కైఫీయతులకు రాసే రచనాకాలాన్ని సూచించబడి వుంటాయి, మరికొన్ని కాలాన్ని సూచించకుండానే అంశాన్ని ఉద్దేశించి రాయడం ప్రారంభిస్తారు.

"టీపు సులుతాను శాలీవాహన శక వరుషంబులు 1783 శోభకృతు సం॥ తాగాయతి శకం 1789 సౌమ్య సంవత్సరం వర్కు యేండ్లు 2 ప్రభుత్వం చేశి యీ కామలాపురం తాలూకు నాల్గు తుకడీగా నాల్గు తుకడీలు చేశ్ని వివరం కీలక సంవత్సరం....." అని వ్రాసి వుంటుంది.

ఆయా గ్రామాలను పుట్టుకను గూర్చి సంగ్రహ చరిత్ర కనబడుతుంది. గ్రామం పుట్టకమునుపు నుండి ఆ ప్రాంత భౌగోళిక పరిస్థితులను గూర్చి వారికి తెలిసినంత వరకు అందులో ప్రస్తవిస్తారు.

గ్రామానికి సంబంధించిన పూర్వపు అంశాలను గూర్చి సరియైన అవగాహన ఏర్పరచుకోలేనప్పుడు ఆ గ్రామంలో ఉండే వయోవృద్ధులను అడిగి తెలుసుకొని ఆ విషయాలను వివరించారు. గ్రామానికి ఉండే సరిహద్దులను గూర్చి, గ్రామంలో ఉండే ఆలయాలు, మసీదులు, పెద్ద పెద్ద చారిత్రక కట్టడాలు, భవనాలను గూర్చి, గ్రామంలో ఉండే నదులు, కొండలు, అడవులు, చెరువులు, బావులు మొదలైన అంశాలను గూర్చి, అక్కడ నివసిస్తున్న జనసంఖ్య, జంతుజాలం, అక్కడ పండే పంటలు వంటి సామాజిక పరిస్థితులను గూర్చి తెలియజేసి ఉంటుంది. చివరలో ముగింపువాక్యంతో ఆ రచయిత(కరణం) యొక్క చేవ్రాలు ఉంటుంది. పై అంశాలన్నీ దాదాపుగా ప్రతి కైఫీయతులోనూ ఎక్కువగా కనబడతాయి. వీటితోపాటు వృత్తులను, కులాలను గూర్చిన అంశాలను తెలిపే కైఫీయత్తులు కూడా కనబడతాయి.

ఆనాటి ఆచార వ్యవహారాలు, సాంఘిక పరిస్థితులు,

భౌగోళిక పరిస్థితులు ఈ కైఫీయతులలో వేలకొలది విషయాలు మనకు కనబడతాయి. సంసార జీవనానికి పట్టుగొమ్మగా నిలచిన స్త్రీ తన భర్త చనిపోతే ఆ చితిమీద దూకి ప్రాణాలను అర్పించడం మనకు కనబడుతుంది.

గ్రామంలోని పంట పొలాలు బాగుండాలని నిర్మించిన తటాకం తెగిపోకుండా ఉండేందుకు సజీవంగా శరీరాన్ని బలిచేసుకున్న సంఘటనలు కనబడతాయి.

రెండు గ్రామాల మధ్య పొలిమేర తాగాదాలు ఏర్పడినప్పుడు, ఆ గ్రామాలవారు అంగీకరించిన వ్యక్తి నియమనిష్ఠలతో పొలిమేర తొక్కి నిర్ణయిస్తాడు. పొలిమేర నిర్ణయంలో తేడా వస్తే ఆ వ్యక్తి మరణిస్తాడని ఆనాటి నమ్మకం.

*తొలి తెలుగు శాసనాలుగా నిలుస్తున్న కడపలోని కలమళ్ల, ఎర్రగుడిపాడు శాసనాల వివరాలు ఈ మెకంజీ కైఫీయత్తుల్లో కనబడతాయి. శాసన పరిశోధకుల స్పర్శ తగలని ఎన్నో శాసనాల వివరాలు ఈ కైఫీయత్తుల్లో బహుళంగా లభిస్తాయి.*

గ్రామంలో దొంగలు పడి పశువుల్ని దోచుకొని పోతున్నప్పుడు, ఆ గ్రామరక్షకుడు(వీరుడు) ఆ దొంగల్ని ఎదిరించి పోరాడి గెలిచినప్పుడు, అతనికి ఆ గ్రామ ప్రజల తరుపున నెత్తుర మాన్యం ఇవ్వడం, ఒకవేళ ఆ వీరుడు మరణిస్తే వీరప్రతిమను ఏర్పాటుచేయడం వంటివి కనబడతాయి.

ఒక చెరువు నిర్మాణం జరిగినప్పుడు ఆ చెరువు కింద పంటపొలాలు ఆ గ్రామంలోని అన్ని వర్గాలవారికి దశబంధం ప్రాతిపదికగా అందుతాయి.

తొలి తెలుగు శాసనాలుగా నిలుస్తున్న కడపలోని కలమళ్ల, ఎర్రగుడిపాడు శాసనాల వివరాలు ఈ మెకంజీ కైఫీయత్తుల్లో కనబడతాయి. శాసన పరిశోధకుల స్పర్శ తగలని ఎన్నో శాసనాల వివరాలు ఈ కైఫీయత్తుల్లో బహుళంగా లభిస్తాయి.

కడపజిల్లాకు చెందిన 'పోలి' గ్రామ కైఫీయత్తులో పోలి అనే వంటమనిషి తన యజమాని కొడుకును కాపాడేందుకు, దాడికి వచ్చిన శత్రువులకు తన కన్నబిడ్డను అప్పగిస్తుంది. ఆమె పేరుమీద పోలి చెరువు, పోలి గ్రామం ఏర్పడ్డాయి. యజమాని కొడుకు వెంకటరెడ్డి ఇంటిపేరు పోలిగా నిలిచిపోయింది. ఆ ప్రాంతం 'పోలినాడు'గా చరిత్రకెక్కింది. ఇది దాదాపు వెయ్యేళ్ల నాటి సంఘటన. కానీ ఈ విషయం మనకు ప్రాచీన చరిత్రలో ఎక్కడా కనిపించదు. ఈ సంఘటనకు కైఫీయత్తులు మాత్రమే ఆధారభూతమయ్యాయి.

కైఫీయత్తులలో ప్రయోగించిన పదాలు పారిభాషిక పదాలను క్రియారూపాలను పరిశీలించినప్పుడు అరబీ పారశీక ఉర్దూపదాల ప్రభావం ప్రస్ఫుటంగా కనబడుతుంది. 14 వ శతాబ్దంలో ఆరంభమైన మహమ్మదీయుల పరిపాలనా ప్రభావం,19 శతాబ్ది నాటి వరకు కూడా తెలుగుభాషపై ఉన్నట్లు మనం గమనిస్తున్నాం. అరబీభాష మతపరమైన భాషగానూ, కావ్యభాషగానూ తెలుగుపై ప్రభావం చూపింది. పారశీకభాషలో అరబీ పదాలెన్నో చేరి, అనంతర కాలంలో వచ్చిన ఉర్దూభాషలో ప్రవేశించాయి. అరబీ, పారశీక భాషా పదాలు ప్రత్యక్షంగా ఉర్దూపైన, పరోక్షంగా తెలుగుపైన ఉన్నట్లు ఈ కైఫీయత్తుల ద్వారా నిర్ధారితమౌతుంది.

అదాలతు (న్యాయము), అర్జి(మనవి), ఇజరా(గుత్త), ఇనాం(మాన్యం), ఉలుఫా (బహుమానము), కచేరి(కొలువుకూటము), కసుబా(పెద్దఊరు), ఖిర్దు(వ్యవసాయం), జామాబంది(శిస్తు ఏర్పరచడం), జుల్మానా(అపరాధము), తాకీదు(ఆజ్ఞాపత్రము), తాలూకా(ఒక విభాగం), కుల్కర్ని(కరణము), కవులు(ఒడంబడిక), దఖలు(స్వాధీనం చేసుకొనుట), దౌలతు(అధికారము), పరగణా(జిల్లాలోని ఒక భాగం), బేచిరాకు(ఇండ్లు లేనివాడు), ఫౌజు(దండు), మవుంజె(పల్లె), సన్నదు(ఆజ్ఞాపత్రిక), సమతు(తాలూకాలో ఒక భాగం), శికస్తు(శిథిలమైన), సుబా(రాజ్యము), హకీకతు(లెక్కల పట్టిక), హిజరి(మహమ్మదీయుల సంవత్సరం) వంటి ఎన్నో పదాలు కైఫీయత్తులలో వాక్యాల మధ్యలో వస్తూ వుంటాయి.

కైఫీయత్తులలోని కొలతలు:

తూము : 25 శేర్లు

యిద్దుము : రెండు తూములు, నల్తుము : నాలుగు తూములు

ఏదుము : అయిదు తూములు, పందుము : పది తూములు

పుట్టి : 20 తూములు, కైఫీయత్తులలోని కొన్ని పదాలకు ఈనాటి పదాలకు ఉచ్చారణలో తేడా ఉంటుంది. బిందువు తరువాత వచ్చే హల్లులన్ని ద్విత్వాక్షరాలై ఉంటాయి. ఉదా: జమాయించ్చుకొని, వ్రాయించ్చుకొని, ఉండ్డబట్టషువంటి, పంట్టు, కాలమంద్దు, కళాపంల్తినులకు మొదలైనవి.

## అక్షర సేద్యం

- సోమవరపు రఘుబాబు
9441457099

చిట్టి పొట్టి మాటలతో
చెట్ట పట్టా లేసుకుని
వడివడిగా బడికెళ్లే
బుజ్జి బాలల భావాలను

డిగ్రీ పట్టాలు పట్టుకుని
కోటి ఆశలు కళ్లలో నింపుకుని
బతుకు బాట పట్టిన
నిరుద్యోగుల నిరాశను

ప్రేమ విఫలమై మనసు వికలమై
తనువు చాలించాలని
చరమగీతం పాడుకుంటున్న
భగ్న ప్రేమికుల రంపపు కోతను

బెత్తెడు జీతం చాలక
భత్యం పెంపుకు నోచక
బిత్తర చూపులు చూస్తున్న
బడుగు సంసారి కష్టాలను

పున్నాగ నరకం దాటిస్తాడనుకున్న
కన్న కొడుకు పుడమిలోనే
ప్రత్యక్ష నరకం చూపిస్తుంటే
ఆశ్రమం దారి పట్టిన వృద్ధుల వెతలను

చూసి చూసి కలం కాగితం తీసి
మదిలో హాలాహలం చిలికించి
భావాల మనోభూమిని పండించి
చేశాను ఈ అక్షర సేద్యం...!!



కొన్ని చోట్ల బిందువు అవసరం లేకపోయిననూ చేర్చబడినది. ఉదా: సొంమ్ము, వుంన్నది, కంన్నియను, గోత్రులుంన్ను మొదలైనవి. కొన్ని చోట్ల చు అక్షరానికి బదులుగా తు అక్షరం కనబడుతుంది.
ఉదా: చెప్పుతున్నారు, కనబడుతున్నది, జర్గుతున్నది మొదలైనవి.

సంస్కృతాంధ్రపదాలు, సంస్కృత అన్యదేశీయాలు, కలసిన సమాసాలు తరచుగా వాడబడినాయి. ఉదా: ఆంజనేయగుడి, గ్రామ కరణీకము, క్షత్రియ కన్నియ, బహుగొప్ప, కాపురస్తులు, గ్రామ మిరాశి,, గ్రామ చెరువు, గ్రామ గుడి, గ్రామ కట్టుబడి, గర్భగుడి, ప్రతిరోజు, అనేకమంది మొదలైన సమాసాల ప్రయోగాలున్నాయి.

సంఖ్యావాచకాలను పరిశీలిస్తే, పద్దెనిమిది, పద్నాలుగు, ఇరువై అనే ప్రయోగాలు, ఒకచోట ఎనభయ్యి నాలుగు, అని యకార ద్విత్వముతో కూడిన ప్రయోగము ఉంది. నూటయాభై అనుదానిలో ఏబది యాభైగా మారింది. నూరు అనురూపం రెండు మూడు చోట్ల ప్రయోగం కనబడుతుంది.

మెకంజీ సేకరించిన 2070 కైఫీయత్తులను ఆయన తరువాత కొంతకాలానికి సి.పి.బ్రౌన్ వాటిని పరిశీలించి అందులోని అంశాలను ఎత్తి వ్రాయించి చెన్నైలోని ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో భద్రపరిచాడు. అవి ఈనాటికీ చెన్నైలోని ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో మనకు కనబడతాయి. అప్పటి సి.పి.బ్రౌన్ మెమోరియల్ ట్రస్టు కార్యదర్శి డా.జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారు, చెన్నైలోని జె.టి.ఆచార్యులు,ఐ.ఏ.ఎస్ గారి సహాయంతో కైఫీయత్తుల జిరాక్సు ప్రతులను బ్రౌన్ గ్రంథాలయానికి చేర్చారు. వాటిలో ఉన్న కడప కైఫీయత్తులను బ్రౌన్ గ్రంథాలయం ఇప్పటికి 7 సంపుటాలు(గొలుసు రాత నుండి ఈనాటి అక్షరరూపంలోకి మార్చి) ప్రచురించింది. ఈ ప్రచురణలో నేను కూడా పాలుపంచుకున్నాను. ఈ గ్రంథాల ప్రచురణకు బ్రౌన్ గ్రంథాలయ సిబ్బంది సహాయంగా, విద్వాన్ కట్టా నరసింహులు గారు ప్రముఖ పాత్ర పోషిస్తున్నారు. యోగి వేమన విశ్వవిద్యాలయ ఉపకులపతి ఆచార్య బేతనభట్ల శ్యామసుందర్ గారు గౌరవ సంపాదకత్వంలో 7 వ సంపుటం వెలువడింది, 8 వ సంపుటం త్వరలో ముద్రించబోతోంది.

మెకంజీ సేకరించిన కైఫీయత్తులు తెలుగు భాషా చరిత్ర పరిశోధనకు, ఆంధ్రదేశ చరిత్ర రచనకు, పదకోశ నిర్మాణానికి, వ్యవహార భాషా వికాసానికి ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. ఇప్పటి వరకు గుంటూరు, నెల్లూరు, ప్రకాశం, విజయనగరం, కృష్ణా, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలకు చెందిన కైఫీయత్తులను ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అభిలేఖనా సంస్థ(స్టేట్ ఆర్కైవ్స్) ప్రచురించింది. ఇంకా ఇతర జిల్లాలకు చెందిన కైఫీయత్తులను ప్రచురించాల్సి ఉంది. ఈనాడు ఏ ప్రాంతమైనా విజ్ఞానసర్వస్వం నిర్మించుకోవాలంటే ఆ ప్రాంతం కైఫీయత్తు ఆధారం లేనిదే అది సమగ్రంగా పూర్తికాదు అని చెప్పవచ్చు.



# నిప్పులాంటి దేశం కోసం

- పి. అనంతరావు
8125510185

ఒకనాటి రాజకీయాల్లో
నిప్పులాంటి వాస్తవ
దేశభక్తి సందేశముండేది.
దేశం ఎర్రగా కణకణలాడేది
ప్రజలు మనోవికాసంతో
పచ్చగా మనగలిగేవారు.
బాధల్ని అవాస్తవాల్ని అధిగమిస్తూ
నిప్పుల్లోంచి ప్రగతిపథంలో నడుస్తూ
సంతోషంగా జీవించేవారు.
ఆ నిప్పుల్లో, బాధల్నించి
అవాస్తవాల్నించి
సంతోషంతో ప్రగతిపథంలో
పయనించేవారు.
నేటి ప్రజలు మననం చేసుకుంటే
అర్థమౌతాయి
ఆనాటి ఈ పుత్తడి పుడమి గురించి
ఎవరి కళ్ళలో చూసినా
ఎవరి మనస్సు తట్టినా
ఎన్నెన్నో కన్నీళ్ళ ఉద్యమాలు
ఉద్ధృతంగా గుర్తుకొస్తాయి

నేటి అక్రమాల వర్తమానంలో
అసమర్థ రాజకీయాలతో
వాళ్ళలో వాళ్ళు దెప్పుకుంటూ
ఒకరిపై ఒకరు
బురద జల్లుకుంటూ
తెలుగుతల్లి మెడలో
ఎవ్వరూ మల్లెలదండ
వేయటం లేదు సరి కదా!
ముళ్ళ కిరీటం పెట్టే
యోజనలో ఉన్నారు.
హామీలన్నీ నీటి మూటలై
ప్రజలు ఊపిరి పీల్చకుండా
ముక్కుపుటాల్ని మూసేస్తూ
ఏ స్పందనా కలుగకుండా
చేసేస్తున్నారు.
సూర్యుడూ చంద్రుడూ
ప్రత్యక్ష సాక్షులైనా
ఏ సాక్ష్యం చెప్పలేక
మబ్బుల చాటున కొండలమాటున
దాక్కుంటున్నారు.
జీవనదులన్నీ దురాక్రమణకు గురి
అవుతున్నాయి
నిర్జీవ నదులన్నీ
పంటలను సర్వ నాశనం చేస్తూ
సామాన్యుల చేతులకు అందకుండా
అక్రమార్కులకు ఊతమిస్తున్నాయి
ప్రకృతి కూడా ఒక నిత్య దినచర్యలా
కాలుష్యంతో రోజూ స్నానం చేస్తున్నది.
మేధావులు వారి సుఖాలు చూసుకుంటూ
అనవసర విషయాలు చర్చించుకుంటూ
తర్జన భర్జనలతో
కాలయాపన చేస్తున్నారు.
అందరికందరూ రాజకీయ కౌరవులూ.
ఒక ప్రధాన శకునితో
ఈ అసమర్థులు ఫిర్యాదులు
చేసుకుంటున్నారు.
ఆ శకుని
అసలు విషయాన్ని
పెడచెవిని పెట్టి
కోతికి కొబ్బరికాయ దొరికినట్టుగ
దొరక్క దొరికిన వీసా దొరకడంతో
మత మౌఢ్యానికి ప్రచారానికి
స్వచ్ఛభారత్ నినాదం జోడించి
ప్రపంచమంతా
విలాస యాత్రలు చేస్తున్నాడు
యోగా దినోత్సవాలు
జరుపుకోమని
ప్రజల్ని భ్రమల్లో ముంచేస్తూ
దేశం అస్తిత్వాన్ని మంట
కలుపుతూ
ఒక జంతువుని చూచి
ఇంకో జంతువు వాతలు
పెట్టుకున్నట్లు
ఇతర దేశాల్ని అనుకరిస్తూ
ప్రగల్భాలు పలుకుతూ
ప్రజల్ని మానసిక రోగులుగా
చేస్తున్నాడు.

ఒకటిగా ఉన్న భూమిని
రెండు ముక్కలు చేసి
ఎవరి ముక్కనివారు
దోచేస్తున్న ఈ కౌరవులు
ప్రజా నేతలు కారు.
ప్రజల పతనం
కోరుతున్న వాళ్ళు
ఒకటి మాత్రం నిజం
ఈ భూభాగం ముక్కలైనా
ప్రజల భాష, భావం
బాధలూ, గాథలూ ఒక్కటే
ప్రజల మనోభీష్టం నెరవేరి
దేశం నిండుగా విలసిల్లాలంటే
దేశంలో సామాన్యుడి రోజులు
ప్రజాస్వామ్యం రోజులు
చిత్తశుద్ధితో పాటించాలి.
అప్పుడు ఈ దేశం
నిప్పులా కణకణ లాడిపోతుంది
ఉజ్జ్వలంగా వెలిగిపోతుంది.



కథ

# ఓ హాస్యగాని మదిలో మాట




ఇంగ్లీషు: ఓ హెన్రీ

తెలుగు: కె. ఉషారాణి

9492879210


ఇరవై ఐదేళ్ళపాటు నిగూఢంగా నాలోనే పెరిగి పెరిగి ఓ రోజు అమాంతంగా నాలోంచి బద్దలయి బయటపడింది. కాని బద్దలయి బయటపడింది ఆటలమ్మ కాదు, హాస్యం.

నేను పనిచేసే దుకాణం యజమాని ఏదైనా పుట్టిన రోజు సందర్భంగా దుకాణంలోని పనివాళ్ళు అందరం మా యజమానికి ఒక పెన్‌స్టాండ్ బహుకరించాలనుకున్నాం. ఆ సందర్భంగా చిన్న సమావేశం ఏర్పాటు చేసాం. సమావేశంలో నేనే మాట్లాడవలసి వచ్చింది. అందరినీ ఆకట్టుకునేటట్లు మాట్లాడాలన్న తాపత్రయంలో ఓ వారం రోజులు తెగ కష్టపడి నా ఉపన్యాసం తయారు చేసుకున్నాను.

నా ఉపన్యాసం బ్రహ్మాండంగా వచ్చింది. చక్కని సామెతలతో, నానుడులతో, హాస్యాన్ని మేళవించి ఆహుతులందరినీ ముగ్ధులను చేసాను. నవ్వులతో హాలంతా ఒకసారి కంపించింది. (హాలు చాలా బలంగా దృఢంగా కట్టబడింది) మా యజమాని మోర్లో కూడా చిరునవ్వు చిందించారు. ఇక నాతోటి పనివారయితే కడుపు చెక్కలయ్యేట్టు నవ్వారు.

ఆరోజు ఉదయం గం॥ 9.30 ని॥ నుంచి నేను పెద్ద హాస్యగానిగా గుర్తింపు పొందాను.

ఇక ఆ రోజు నుంచి కొన్ని వారాలు నాతోటి ఉద్యోగులు నన్ను ఎగేస్తూనే ఉన్నారు. నా ఉపన్యాసం చాలా తెలివిగా ఉందన్నారు. ఒక ముసలాయనైతే నే చెప్పిన ప్రతి హాస్యపంక్తిని విడమరిచి చెప్పి చెప్పి నన్ను ఆకాశానికి ఎత్తేసాడు.

కొన్నాళ్ళకి నేను నా హాస్య చతురతను నిలుపుకోవలసిన అగత్యం ఏర్పడింది. మిగిలిన అందరూ ఆరోజు వ్యవహారాలు, వ్యాపారాల గురించి మాట్లాడేవారు. కాని నేను మాత్రం వాటికి కొంత ప్రత్యేక వ్యంగ్యోక్తులను జోడించి మాట్లాడవలసి వచ్చేది. మాట్లాడేది వంటపాత్రల గురించైనా, చలువరాతి గురించయినా పరిహాసాన్ని జోడించవలసిందే.

నేనొక లెక్కలు చూసే గుమస్తాని. ఏ రోజయినా జమాఖర్చులన్నీ వ్రాసిన తరువాత చివరగా ఓ హాస్యోక్తి లేదో నాతోటి వారంతా నిరాశకు గురయ్యేవారు.

రోజు రోజుకూ నా పరపతి పెరగడం మొదలయింది. స్థానికంగా నాకో గుర్తింపువచ్చింది. మా ఊళ్ళు చిన్నవవడం

వలన గుర్తింపు రావడం తేలిక. ఇక ఊరందరూ కలిసేచోట నేను ఉండి తీరవలసిందే.

వెంట వెంటనే చలోక్తులు విసరడం నాకు జన్మతః వచ్చింది. దీనికి నేను ప్రయత్నపూర్వకంగా మరింత పదునుపెట్టాను. అయితే సహజ సిద్ధంగానే నా మాటలలో నేనెవరినీ నొప్పించే వాడిని కాదు. నెమ్మదిగా జనాలు నేను కనిపించగానే చిరునవ్వుతో పలకరించడం మొదలుపెట్టారు. ఆ చిరునవ్వును దరహాసంగా మార్చేందుకు నా దగ్గర ఓ మాట సిద్ధంగా ఎప్పుడూ ఉండేది.

నాకు చిన్న వయసులోనే పెండ్లయింది. నాకు మూడేళ్ళబాబు, ఐదేళ్ళ పాప ఉన్నారు. సహజంగానే మేమొక చిన్న పొదరింటిలో ఆనందంగా ఉన్నాం. ఓ ఇనప కోట్లో గుమస్తాగా నాకొచ్చే కొద్దిపాటి జీతం జేబులు నిండిన వారికి సహజంగా వచ్చే అనేక రోగాల నుండి మా కుటుంబాన్ని రక్షించి ఆరోగ్యంగా ఉంచింది.



నాకు తీరిక దొరికినప్పుడల్లా వ్యంగ్య చిత్రాలు గీసి వ్యంగ్యోక్తులు చేర్చి రకరకాల వారపత్రికలకు, దినపత్రికలకు పంపడం అలవాటయింది. వారు పంపినదే తడవుగా ప్రచురించి తృణమో, ఫణమో పంపేవారు. అంతేకాదు మళ్ళీ మళ్ళీ పంపమని ఆ పత్రికల ఎడిటర్లు అర్థించేవారు కూడా.

ఓ రోజు ఓ ప్రసిద్ధ వారపత్రిక ఎడిటర్ దగ్గరి నుండి నాకో ఉత్తరం వచ్చింది. వాళ్ళ పత్రికలో నా జోక్స్ కోసం కొంత స్థలం కేటాయిస్తామని, సంతృప్తికరంగా నా పని ఉంటే నన్ను పర్మనెంట్‌గా నియమించుకుంటామని సారాంశం. రెండువారాలు నేను పంపాను. వాళ్ళకు నచ్చి నాతో ఒక ఏడాది ఒప్పందం కుదుర్చుకునేందుకు సిద్ధపడ్డారు వాళ్ళు ఇవ్వజూపిన మొత్తం కొట్టు గుమస్తాగా నా జీతానికంటే ఎంతో ఎక్కువ.

నా ఆనందానికి హద్దేలేదు. నా భార్య అప్పుడే నా విజయాన్ని ఆస్వాదించి నన్నో పెద్ద రచయితగా ఊహించుకోవడం మొదలుపెట్టేసింది. ఆ రోజు రాత్రి మేం పండగ చేసుకున్నాం. ఇక కోట్లో గుమస్తాగిరీకి ఉద్వాసన చెప్పి హాస్యానికి జీవితం అంకితమివ్వాలని నిర్ణయించుకున్నాం.

అనుకున్నట్టే నేను నా ఉద్యోగానికి రాజీనామా చేసాను. నాకు మంచి వీడ్కోలు సభ ఏర్పాటు చేసారు. ఆనాటి నా సభలో ప్రసంగం పూర్తిపాఠం మర్నాటి 'గజిట్' పత్రికలో వచ్చింది. నేను నిద్రలేచి సమయం చూసుకుని తృళ్ళిపడ్డాను. దుకాణానికి ఆలస్యం అవుతున్నదని ఆందోళనగా పరుగులు తీయబోయేంతలో నా శ్రీమతి నా బానిస బ్రతుకు ముగిసిందని గుర్తుచేసింది. ఇప్పుడు నేనొక వృత్తి దారుడిని. హాస్యమే నా వృత్తి.

అల్పాహారం ముగించిన వెంటనే వంటింటి ప్రక్కనే నా పని కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన గదిని నా శ్రీమతి చూపించింది. అందులో ఓ టేబుల్, ఓ కుర్చీ, వ్రాసుకునేందుకు అనువుగా ఓ వ్రాత పలక సిరా, పైప్‌ట్రే అమర్చి పెట్టింది. బల్లమీద డిక్షనరీ, రోజాపూలు, గోడకు కేలండర్, ఓ డబ్బాలో చాక్లెట్లు ఎంతో ప్రేమతో అమర్చి పెట్టింది.

ఇక నేను వ్రాసేందుకు సిద్ధపడ్డాను. నా ఆలోచనలు అటు ఇటు కదులుతున్నప్పుడు ఓ పెద్ద గావు కేక పెట్టింది నా శ్రీమతి. మీ పని ముగిస్తే భోజనానికి లేవమన్నదే ఆ కేక. నా గడియారం వంక చూసాను. భోజనం సమయమయింది. భోజనానికి లేచాను.

"గొథేనో నెపోలియన్ చెప్పినట్లు మెదడుతో పనిచేసేవారు 5 గం॥ల కన్నా ఎక్కువ పనిచేయకూడదు. ఈ రోజు మీరు 5 గం॥లు పనిచేసేసారు. కాబట్టి సాయంత్రం నన్ను, పిల్లలను బయటకి, ఏ పార్కుకో తీసుకెళ్ళచ్చుకదా" అంది నా శ్రీమతి.

"నాకూ అలసటగానే ఉంది" నేను ఒప్పుకున్నాను. అందరం బయటకు వెళ్ళాం.

త్వరలోనే నేను నా వృత్తిలో నిలదొక్కుకున్నాను. వారపత్రికలో నా స్థానం స్థిరపడింది. నా శీర్షికకు గుర్తింపు వచ్చింది. ఇంకొన్ని పత్రికలకు కూడా నా కార్టున్లు పంపడం మొదలు పెట్టాను. నా ఆదాయాన్ని పెంచుకున్నాను. నా స్థితిని పెంచుకున్నాను.

నా వృత్తిలో మెళుకువలు గ్రహించాను. ఓ నవ్వు పుట్టించే

ఆలోచనకు రెండు పంక్తులు జోడించితే ఓ డాలరు ఆదాయం వస్తుంది. ఒకే ఆలోచనకు చలోక్తులు మార్చినా పెద్దగా ఎవరూ గుర్తించడం లేదు. నాకు మాత్రం కాసులు రాలుతున్నాయి. డబ్బులు సంపాదన పెరగంగానే మా ఊరి జనం నన్ను చూసే తీరే మారింది. ఇప్పుడు నన్ను ఓ షాపు గుమాస్తాగా ఎవ్వరూ చూడడం లేదు. ఓ పెద్ద మనిషిగా గుర్తిస్తున్నారు.

ఒక ఆరు నెలల తరువాత నా చలోక్తులకు సహజత్వం గండం ప్రారంభమయింది. ఇదివరకులా ఆలోచనలతోపాటూ వ్యంగ్యోక్తులు పలకడం లేదు. ఒక్కొక్కసారి విషయాల కోసం తడుముకోవలసి వస్తున్నది. కొన్ని రోజుల తరువాత గంటలు గంటలు నా పెన్సిల్‌ని నమలడం, గోడ వైపు తదేకంగా చూడడం మొదలు పెట్టాను. సరికొత్త ఆలోచనలకోసం! నాలో వ్యాకులత పెరిగింది. లోభం పెరిగింది. దుర్భలత పెరిగింది. నా స్నేహితుల సంభాషణలను జాగ్రత్తగా వినడం ప్రారంభించాను. వారి పెదవులనుండి జారిపడే ఓ చక్కటి సన్నివేశం కోసం, ఓ మంచి ఆలోచన కోసం, ఓ నానుడి కోసం, ఆతృతగా ఎదురు చూడడం మొదలుపెట్టాను. కుక్కపిల్ల ఎముక ముక్క వెంటపడేటంత ఆత్రంగా వారి వెంట పడేవాడిని. నా జ్ఞాపకశక్తిపై నమ్మకం పోయింది. ఆసక్తి కలిగించే ప్రతి విషయాన్ని నా నోట్ పేడ్‌లో వ్రాసుకోవడం ప్రారంభించాను. ఎప్పటికయినా ఉపయోగపడుతుందన్న ఆశతో.

నా స్నేహితులు నన్ను ఆశ్చర్యంతోనూ, ఆందోళనతోనూ చూడడం మొదలుపెట్టారు. నేను మునుపటి మనిషిని కాను. ఒకప్పుడు నేను వారినందరినీ ఉర్రూతలూగించేవాడిని. ఇప్పుడు నేనే వీరిని ఎలా వినియోగించుకోవాలా అని ఆలోచిస్తున్నాను. వారిని నవ్వించాలని అనుకోడం లేదు. వారందరూ ఇప్పుడు నాకు అతి విలువయినవారు. నా జీవనభృతిని వెన్నెలా పోగొట్టుకోడానికి సిద్ధపడతాను. ఒక్కమాటలో చెప్పాలంటే గూటికింద నక్కలాగా వారు వేసే జోక్స్ కోసం ఎదురుచూడడం మొదలుపెట్టాను. క్రమంగా నన్నందరూ దూరంగా పెట్టడం మొదలుపెట్టారు నేనసలు నవ్వడమే మరిచిపోయాను. కనీసం నేను అంది పుచ్చుకున్న నానుడులకు గుర్తింపుగా కూడా నవ్వడం లేదు. నా స్నేహితుల దగ్గర నుండి నానుడులను నా వృత్తికి అవసరమయిన 'వస్తువు' కోసం నేను వెతకని చోటు లేదు. సమయం లేదు. సందర్భం లేదు. ఆఖరికి ప్రార్థనా మందిరాన్ని నేను వదలలేదు. ప్రార్థనలను అర్థం చేసుకోవాలన్న భావన కన్నా ప్రార్థనలపై వ్యంగ్యోక్తులు ఎలా అల్లాలా అని సతమతమయ్యేవాడిని.

నా ఇల్లూ నా వేటకి భూమికే అయింది. నా భార్య మూర్తీభవించిన స్త్రీత్వం గల వ్యక్తి. హాస్యప్రియురాలు. స్పందించే హృదయం గలది. దయామయి. ఒకప్పుడు ఆమె మాటలు నన్ను మైమరిపించేవి. మురిపించేవి. కాని నేనిప్పుడామె మాటలను ఆస్వాదించడం లేదు. ఆనందించడం లేదు. ఉపయోగించుకుంటున్నాను. అవి నాకు ఇప్పుడు బంగారు గనులు. మా ఇంటిని నవ్వుల పువ్వులలో ముంచెత్తే ఆ ముత్యాల నరాలను నేనిప్పుడు అమ్ముకుంటున్నాను. నిర్భయంగా ఔదార్యంగా నా ముందు నా కోసం పరిచిన ఆమె హృదయాన్ని నేను ముద్రించి ప్రజలందరికీ పంచుతున్నాను. ఆమెను ముద్దాడి వంచిస్తున్నాను. కొన్ని బంగారు నాణాల కోసం ఆమె నమ్మకాన్ని బజారులో అమ్మకానికి పెట్టాను.



రాత్రిపూట కూడా లేడిపిల్లపై తోడేలులా ఆమెపై పడి ఆమె నా చెవిలో చెప్పే విషయాలు కూడా మర్నాడు నేను నా శీర్షికకు ఎలా ఉపయోగించవచ్చో అనే ఆలోచిస్తున్నాను. ఇది ఇంతటితో ఆగలేదు. నా పిల్లలు ముద్దులొలికే చిన్నారులు. అమాయకమయిన ఆలోచనలతో మాటలతో పరవశింప చేస్తారు. నేను వారినీ వదిలిపెట్టలేదు. 'చిన్నపిల్లల చిత్రమయిన అభిలాషలు' అనే పిల్లల పత్రికకు వారి నుంచి నేనుగ్రహించిన విషయాలను శీర్షిక రూపంలో పంపడం మొదలుపెట్టాను. తలుపులు వెనక, సోఫాల వెనక్కి తోటలో చెట్ల వెనక దాగి దొంగతనంగా వినడం మొదలుపెట్టాను. ఒక్కొక్కసారి మోచేతులపై మోకాళ్ళపై పాకుతూ కూడా వారి వెంటపడేవాడిని.

ఇలా వారి వెంట పడడం వలన పిల్లలు కూడా నాకు దూరమవడం ప్రారంభించారు. నేను దరిదాపులకు రావడం

గమనించిన వెంటనే అమ్మో! నాన్న వస్తున్నాడంటూ పరుగులు పెట్టడం కూడా నేను గమనించాను.

అయినా మొదటి సంవత్సరం గడిచేనాటికి నా ఆదాయం బాగా పెరిగింది. మా కుటుంబపోషణకు పోగా నేను వెయ్యి పౌండ్లు మిగుల్చుకోగలిగాను. అయితే దీనికోసం నేను నా స్నేహితులను పోగొట్టుకున్నాను. సరదాలను కోల్పోయాను. సంతోషాలను వదులుకున్నాను. నా కుటుంబం ఆనందాన్నే పణంగా పెట్టేశాను. నేనొక తేనెటీగనై జీవితంలో ఆనందాన్నిచ్చే ప్రతి పువ్వు మీద వాలి అందులోని మాధుర్యాన్ని పీల్చేసి, నన్ను చూసి అందరూ దూరంగా పరుగులు తీసే పరిస్థితి తెచ్చుకున్నాను.



ఒకరోజు ఒక మనిషి నన్ను చిరునవ్వుతో పలకరించాడు. ఈ మధ్య నన్నెవరూ ఇలా పలకరించలేదు. పీటర్ హాఫిల్ బోవర్ యజమాని. పీటర్ నన్ను తలుపు తెరిచి లోనికి ఆహ్వానించాడు.

ఆ రోజు చల్లగా ఉంది. వాన పడుతున్నది. మేం వెనకనున్న ఓ గదిలోకి వెళ్ళాం. అక్కడనే గది ఉంది. గది వెచ్చగా ఉంది. ఇంతలో అక్కడికి ఒక కస్టమర్ వచ్చాడు. పీటర్ నన్ను ఒంటరిగా వదిలి కస్టమర్‌కి ఏం కావాలో కనుక్కునేందుకు వెళ్ళాడు. నాకు ఆ వాతావరణం బాగా నచ్చింది. గది అందంగా ప్రశాంతంగా ఉంది.

నా తప్పులన్నంటినీ గుమ్మంలోనే వదిలిపెట్టి నేను గదిలోకి అడుగుపెట్టాను. నా శీర్షికల గురించి, వ్యంగ్యాన్ని గురించి ఆలోచించాలనిపించలేదు. చక్కని ఆలోచనలతో నా మెదడు ప్రశాంతంగా ఉంది.

ఒక పావు గంట నేను హాస్య రచయితను కాను. నేనిప్పుడు ప్రశాంతత నిండిన ఒక తాత్వికుడిని హాస్యోక్తుల నుండి, చతురోక్తుల నుండి, వ్యంగ్యోక్తుల నుండి పారిపోయి ఇక్కడ ఆశ్రయం పొందాను. అవిశ్రాంతంగా చేసిన సిగ్గుమాలిన ఎగతాళి నుంచి, ఎడతెరిపిలేని జోక్స్ నుండి, చులకనైన వ్యంగ్యం నుంచి తప్పించుకుని ఇక్కడున్నాను.

హెఫర్‌బోర్‌తో నాకు పరిచయం లేదు. అతను తిరిగి నా దగ్గరకు వచ్చిన తరువాత అతనిని మాట్లాడనిచ్చాను. అయితే అతను మాటలు వినేందుకు అనాసక్తిగా ఉన్నాయి. స్థబ్దుగా ఉన్నాయి. జడత్వంతో నిండి ఉన్నాయి. అందులోని ఒక్క పదంలోనయినా ఓ బెణుకు లేదు. నేనో జోక్ చెప్పినా అతను దాన్ని అసలు పట్టించుకోలేదు. ఇక అప్పటి నుండి నేను అతనిని అభిమానించడం మొదలుపెట్టాను.

వారంలో రెండు మూడు రోజులు నేను హెఫర్‌బోర్ వెనక గదిలో గడిపేవాడిని ఉదయం తొందరగా లేచినా పనులు గబగబా ముగించుకుని నా 'స్వర్గం' లో కొంతకాలం గడిపేవాడిని నా శీర్షికలకి మరెక్కడైనా విషయసేకరణ జరిగేది గాని పీటర్ దగ్గర మాత్రం కాదు.

ఈ పరిస్థితులలో మళ్ళీ నేను ఉత్తేజితుడనయ్యాను. ఇక్కడే నేను నా శ్రమ నుండి విశ్రాంతిని పొందగలిగింది. ప్రతి వ్యక్తికి ఇటువంటి విశ్రాంతి అవసరమే. రోడ్డుపై నా మిత్రులు కలిసినప్పుడు తిరిగి పాత రోజులలాగా ఓ బెణుకు వేసి నవ్వించి వారిని ఆశ్చర్యంలో ముంచెత్తాను. నా కుటుంబ సభ్యులనూ అలాగే ఆశ్చర్యచకితులను చేసా.

నా స్వర్గానికి వెళ్ళాలన్న ఆతృతతో పని రెట్టింపు వేగంతో చేసేవాడిని. ఇది నా పనికి కొంత నష్టాన్ని కూడా కలిగించింది. నా భార్య మాత్రం నేనెక్కడికి వెళుతున్నానా అని ఆందోళన పడడం మొదలెట్టింది. ఓ రోజు హెఫర్ బోర్ వెనక గదిలో ఉండేటటువంటి శవపేటిక వెండి హేండిల్‌ను, నా బల్ల శుభ్రపరుచేందుకు సన్నని, మెత్తటి గుడ్డ్రంజాలు కుచ్చును తెచ్చుకున్నాను. అవి నా గదిలో పెట్టుకుంటే బాగుంటుందనిపించింది. కాని వాటిని చూసిన నా భార్య గగ్గోలు పెట్టింది. ఇక వాటిని తీసేయక తప్పలేదు.

ఓ రోజు హెఫర్ బోర్ నా ముందు తన లెక్కల పుస్తకాలు పరిచి తనకు లాభాలు పెరుగుతున్న విషయాన్ని చూపించారు. తన వ్యాపారంలో భాగస్వామిని కోరుకుంటున్నానని అతడిని అయితే బాగుంటుందని సూచించాడు. మిగిలిన తన పరిచయస్థులందరికన్నా నన్నే భాగస్వామిగా ఇష్టపడతానన్నారు. ఆ రోజు నేనింటికి బయలుదేరే సమయానికి పీటర్ చేతిలో నా వెయ్యి పౌండ్ల చెక్కుంది.

ఆ రోజు రాత్రి మేం భోజనం చేసే సమయంలో నా

## మట్టి నానీలు

- నాంపల్లి సుజాత
9848059893

ఇవ్వాల మట్టి
కన్నీరు పెడుతుందా?
అవును !
మనుష్యుల కాలుష్యానికి



ప్రకృతి చికిత్సలో
మట్టికి పెద్ద పీటే
లేపనాలతో
చర్మం వికసనం

సమస్త ఖనిజాలు
మట్టి నుంచే
మనిషికి కానుకలైన
జలజాలు

పుడమి తల్లికి
కెంపుల ముక్కుపుడకలు
కదిలే
ఆరుద్ర పురుగులు

మట్టి పొర మాటున
సంచరించే జీవి
ఎవరికీ పట్టని
పుట్ట చెదలు



## ఓ అభాగిని

- నారాయణమూర్తి తాతా
9298004001



ఊరి చివర
మురిక్కాలవ చెంత
పూరి గుడిసె

తాగుబోతుకి
పాచిపని పెండ్లాము
ఓ ఆడపిల్ల

అంటగిన్నె
మొద్దెక్కిన చేతికి
బరువైనది

వయసు పొంగు
పై పై మెరుపులకు
లొంగిపోయింది

అనుభవాలు
చేతులు మారడాలు
బలిపశువై

అత్తరుపూసి
మల్లెలు పెట్టుకుని
అర్పించే మేను

తనది కాదు
ఆకలి తప్ప ఏమీ
మిగుల లేదు

ఆ జువ్వి చెట్టు
కింద చేరి కుళ్ళుతూ
చివరికలా

రాలే విరుల
పండుటాకుల కింద
దీర్ఘనిద్రకు

ఓ అభాగిని
నిన్నూ నన్నూ
ప్రశ్నిస్తూ
వెళ్ళిపోయింది



---

భార్య నాకు కొన్ని ఉత్తరాలిచ్చింది. అందులో కొన్ని నేను పంపిన కార్టూన్లు తిరిగి వచ్చినవి వున్నాయి. ఒక ఉత్తరం నేను ప్రతివారం జోక్స్ పంపే వారపత్రిక ఎడిటర్ దగ్గరినుండి వచ్చింది. సారాంశం : ఇది వరకు మీ జోక్స్ సహజంగా, సులువుగా హాస్యంతో నిండి ఉండేవి. ఇప్పుడు కష్టపడి, చదివి, అపనమ్మకంతో వేస్తున్నట్టుగా ఉన్నాయి. అందువలన మీతో కాంట్రాక్టును పొడిగించలేము.

ఆ ఉత్తరాన్ని నేను నా భార్య చేతికిచ్చాను. దానిని చదివిన ఆమె కంట నీరు పెట్టుకుంది. ఇప్పుడు ఇక వెనకటి ఉద్యోగం చెయ్యాల్సిందేనా అని ఏడుపు ప్రారంభించింది. నేను మాత్రం మేము అన్నం తినే టేబుల్ చుట్టూ గంతులేయడం మొదలుపెట్టాను ఆనందంగా. కాని నా భార్య మాత్రం అనుకోకుండా ఏర్పడిన అవాంతరంతో నేను మతిస్థిమితం కోల్పోయాననుకుంది. ఇది వరకు వాళ్ళతోపాటే గంతులు వేసినట్టే మళ్ళీ నేను గంతులేయడం చూసిన మా పిల్లలు నాతోపాటు సంతోషంగా గంతులేయడం ప్రారంభించారు. అంతేకాదు, ఈ రోజు నుండి నేను బాగా వృద్ధిలోకొస్తున్న పీటర్ హెఫ్‌బోర్ రెస్టారెంటు భాగస్వామినని కూడా ప్రకటించాను.

ఎడిటర్‌గారి ఉత్తరం చేతిలో ఉండడం వలన నా భార్య అడ్డు చెప్పలేదు.

చివరిగా నే చెప్పేదేమిటంటే, ఈరోజు మళ్ళీ మునుపటిలాగా నా స్నేహితులతో నేను చెణుకులు వేయగలుగుతున్నాను. నా చిత్రాలలో హాస్యం పండించ గలుగుతున్నాను. నా భార్య నమ్మకాన్ని కాపాడగలుగుతున్నాను. నా పిల్లలు ముందురోజుల్లోలాగే నా కాళ్ళకడ్డం పడే, నా చుట్టూ తిరిగి ఆడుకుంటున్నారు. మా వ్యాపారం మూడు పువ్వులూ ఆరుకాయలుగా వృద్ధి చెందింది. నేను మా వ్యాపారం లెక్కలు చూస్తాను. బయటి వ్యవహారాలు పీటర్ చూసుకుంటున్నాడు. చావుమేళంకి కూడా జవజీవాలు పోసే సమర్థుడినని నన్ను పీటర్ తెగ మెచ్చుకుంటుంటాడు.



# 'శిల్పి' అంతరంగం

- డా॥ దొమ్మాటి జ్యోతి
8985228351
- దుబాసి మాలతి



*ప్రపంచంలో ఎంతమంది శిల్పకారులు ఉన్నా వారి పేరు బయటికి వచ్చిందా అని పరిశీలించి చూస్తే ఒకటి రెండు చోట్ల తప్ప ఎక్కడా శిల్పి పేరు వినిపించదు. శిల్పి శ్రమైక సౌందర్యాలను దోపిడిగావించిన పాలకుల పేర్లే వినుతికెక్కినాయి. అట్లాంటి 'శిల్పి'ని జి. యాదగిరి ప్రశంసా పర్వంలో స్థపతివర్యుడా అని కీర్తించారు.*

'శిల్పి' ఒక ఖండకావ్యం, దేవాలయాల్లో శిల్పాలను చూసి ప్రేరణ పొందిన జి. యాదగిరికి వచ్చిన ఆలోచనల పరంపరను అక్షరబద్ధం చేసిన కావ్యమిది. చమత్కార యుతమైన రచన కావ్యమగును. చమత్కారమనగా సంతోషాన్ని కలిగించేది. ఈ కావ్యరచనలో శిల్పి అంతఃరంగాన్ని, నైపుణ్యాన్ని తెలుపుతూనే, అతని జీవితంలోని వాస్తవ స్థితిగతులను వేదనాభరితమైన ఆలోచనా ధోరణిలో ప్రస్తుతించారు. శిల్పాలు అందంగా ఉండడానికి ముఖ్య కారణం శిల్పి యొక్క కళానైపుణ్యం దృష్టి కోణమే. నాటి కాలంలో శిల్పులు రాజరికాలు ఒత్తిళ్ళకు లోబడి దినదినం - భయంతో మేధస్సును మధించిన ఆలోచనలతో ఆకలి దప్పికల్ని, కష్టసుఖాలను లెక్క చెయ్యకుండా, అనుభవాన్ని పెంపొందించు కుంటూ భార్యా పిల్లలను సైతం ఆలోచనల్లోకి రానీయకుండా రాతిని చెక్కి అందమైన రసానుభూతిని కలిగించే రమ్యమైన శిల్పాలను తీర్చిదిద్దారు. చేసే పనిలో అభివృద్ధే వారి ధ్యేయం. వారి శరీరానికి ఏమైనా లెక్క చేసే వారు కాదు. వారి ముందు ఉన్న లక్ష్యాన్ని చేరుకోవడమే వారికున్న అసలైన కృత్యం. ఇంత చేసినా వారి కళా ప్రతిభకు రావాల్సిన గుర్తింపు వచ్చిందా? అని ప్రశ్నించుకుంటే శిల్పికి తగిన గుర్తింపు రాలేదనే సమాధానమే వస్తుంది. ప్రపంచంలో ఎంతమంది శిల్పకారులు ఉన్నా వారి పేరు బయటికి వచ్చిందా అని పరిశీలించి చూస్తే ఒకటి రెండు చోట్ల తప్ప ఎక్కడా శిల్పి పేరు వినిపించదు. శిల్పి శ్రమైక సౌందర్యాలను దోపిడిగావించిన పాలకుల పేర్లే వినుతికెక్కినాయి. అట్లాంటి 'శిల్పి'ని జి. యాదగిరి ప్రశంసా పర్వంలో స్థపతివర్యుడా అని కీర్తించారు.

"రాత్రి పగలని అనక, విరామ మనక
ఆలుబిడ్డలనక, మరి ఆకలనక
రాళ్ళు తొలువంగ, మలువ నీ రక్త సిక్త
హస్తములు కడుగగ నీదే అందుకొనుము"

('శిల్పి' పుట : 17)

అని తెలుపుతూ రచయిత శిల్పికి అశ్రు తర్పణములు సమర్పించుకున్నారు. రాత్రి పగళ్ళు కష్టించి కఠిన శిలలను మనోహరమైన శిల్పాలుగా తీర్చిదిద్దిన శిల్పి గొప్పతనాన్ని కొనియాడారు.

దేవాలయాల్లో విగ్రహరూపంలో కొలువైయున్న దేవుళ్ళ రూపం భక్తుల కోరికల్ని తీరుస్తలేదని, అందులో దాగున్న శిల్పి అంతరంగమే సిరులిస్తున్నదని, వరములిస్తున్నదని, రక్షణగా నిలుస్తున్నదని తెలుపుతూనే శిల్పాలకు, పూజలు చేస్తున్న పూజారి కడుపును కూడా నింపుతున్నది కూడా కేవలం 'శిల్పి' చేతి భిక్షేనని తెల్పారు.

"దేవతలనెల్ల రాళ్ళ బందీలు చేసి
లోక కళ్యాణమును కోరనీకె తగుర "

('శిల్పి' పుట: 7)

ఈ ప్రపంచంలో దేవుళ్ళను నిత్యం రాళ్ళ బంధీలుగా చేసే శక్తి ఒక్క శిల్పులకు మాత్రమే ఉన్నదని మరెవ్వరికీ లేదని అందులో దాగున్న తాత్విక చింతనను బాహిర్గతం చేశారు. సకల శాస్త్రాలు చదివిన ఏ విద్యావంతుడైనా ఏదైనా ఒకే ఒక శాస్త్రంలో ప్రావీణ్యుడై ఉంటాడు. కానీ 'శిల్పి' లో జి. యాదగిరి సకల శాస్త్రాలు తెల్సిన, ఎవ్వరికీ సాటిలేని జ్ఞానవంతున్ని చేసారు.

"సంగీత శాస్త్ర ప్రశస్తుడౌగాకున్న
రాతిలో నాద మే రీతి బల్కె?
నృత్యకళా శాస్త్ర నిపుణుడౌగాకున్న
శిల్పాలు నాట్యాలు సల్పునెట్లు?
చిత్రకళా శాస్త్ర సిద్ధుడౌగాకున్న
కిర్మీర సంకీర్ణ మర్మమేమి?
కవితా కళాశాస్త్ర ఘటికుడౌగాకున్న
వర్ణనాత్మక శిల్ప వాస్తువేమి?"

అంటూ శిల్పికి ప్రత్యేక గుర్తింపునిచ్చారు. లలితకళల గూర్చి సంపూర్ణంగా తెలుసుకొని సిద్ధహస్తుడైన శిల్పిని 'శిల్పకళా జిగీష' 'మేటి ఓజువు', 'ఇక లేరు సాటి ఎవరు' అని ప్రశంసా పర్వంలో ముంచెత్తారు. శిల్పిని ఇంతగా గుర్తించింది జి. యాదగిరి ఒక్కరే అనటం అతిశయోక్తి కాదు. వారు ఉలితో చెక్కి తీర్చిదిద్దిన శిల్పాల నైపుణ్యం ఇప్పటికీ లభ్యమే. శిల్పికి మతాంతరం, మనుషుల అంతరాలు తెలువదు. తెలిసిందల్లా రాతిని ఉలి దెబ్బలకు లోను చేసి అద్భుతమైన శిల్పాలుగా తీర్చి దిద్దటమే. అది నల్లరాతిలో పిల్లనగ్రోవి వాయించే క్రిష్ణయ్య, పాలరాతి శిల్పం, రెబక, నృత్యభంగిమలో నటరాజు శివుడు, వెయ్యి స్తంభాల గుడిలో రాతి నంది, ఖిలా వరంగల్‌లో కాకతీయ కళాతోరణం... ఇంకా ఏదైనా కావచ్చు... శిల్పి కళానైపుణ్యతకి ఏ కొలమానం సరితూగదు.

"తునిగి పోయిన శిల్పాల తుంటె కూడా
దివ్యమగు నీ కళార్తిని తెలుపగలదు
అరిగిపోయిన శిల్పాల అంచు కూడా
గత చరిత్రను కన్నుల కట్టగలదు"

(శిల్పి . పుట: 4)

అంటూ విరిగిపోయిన శిల్పాల్లో సైతం విలువైన గుర్తుల్ని ఎత్తిచూపారు. మనదేశంలో మత యుద్ధాల కారణంగా శిల్పసంపద ధ్వంసమైనా కాని ఆ ముక్కల్లో సైతం కనిపించిన అందాల్ని వర్ణించారు. శిల్పి సృష్టించిన శిల్పాలు మత చాందసుల విధ్వంసాలకు లొంగలేదని, భయానికి లోను కాలేదని, ఎండలు - వానలు భయంకరమైన ప్రళయాలు వచ్చినా కానీ పెదాల పై చిరునవ్వులు చెరిగిపోలేదని వడగాల్పులు తాకినా గాని కన్నుల చురుకుదనం కరిగిపోలేదని, ఎన్ని కాలాలు మారినా గాని 'అందాల నగీషీలు కందలేదు' అని తెల్పారు. ఇంతటి అందమైన శిల్పాలను తీర్చిదిద్దుతున్న శిల్పి సంసార జీవితంలో పడుతున్న ఇబ్బందులను 'సంసారపర్వం' అనే శీర్షికలో తెలిపారు. లక్ష్య సిద్ధి పోరాటంలో భార్యపిల్లలు గుర్తుకు రారు. పెళ్ళి చేసుకొన్నాక కొన్ని రోజులూ సంసారసుఖం పెండ్లి సేసుకున్న కర్మానికి తిప్పలు భార్య అనుభవిస్తున్నదని, భార్యా పిల్లల్ని పోషించలేని కళలు నేర్చుకొని ఫలితం ఏమున్నదని ప్రశ్నిస్తాడు. శిల్పి శిల్ప కళాసృష్టి అనే దాహంలో చిక్కి ఉన్నాడని తెల్పుతూ భార్యతో ప్రేమానురాగాలను పొందలేక పోతున్నాడని

*శిల్పి సృష్టించిన శిల్పాలు మత చాందసుల విధ్వంసాలకు లొంగలేదని, భయానికి లోను కాలేదని, ఎండలు - వానలు భయంకరమైన ప్రళయాలు వచ్చినా కానీ పెదాల పై చిరునవ్వులు చెరిగిపోలేదని వడగాల్పులు తాకినా గాని కన్నుల చురుకుదనం కరిగిపోలేదని, ఎన్ని కాలాలు మారినా గాని 'అందాల నగీషీలు కందలేదు' అని తెల్పారు.*

"శిల్ప సుందరియే నీదు జీవితమున
పెన్నిధయ్యెను, ఆమెయే పెండ్లామయ్యె"

(శిల్పి పుట : 25)

అని తెలుపుతూ శిల్పిగా రాళ్ళతో చేసిన సాహవాసంలో శిల్పి రాయిగానే మారి పోయిండని, తోటి మనుషుల మనసులను తెలుసుకోలేక పోతున్నాడని, మనసు కరుగుతలేదని తెల్పారు. విషణ్ణ వదనాలతో శిల్పియైన భర్తను చూడ్డానికి వచ్చిన భార్యను ఏదో ఆలోచనతో వెనుతిరిగిన శిల్పికి భార్యముఖంలో దుఃఖయుత ముఖ కవలికలు దొరికాయని సంతోషించాడే కానీ, భార్యను ఓదార్చలేదని, 'చింతనామయ శిల్పమ్ము చెక్కినావు' అని శిల్పికి జోహార్లు అర్పిస్తూ...

# రైలు పట్టాలు

గోరుగంతుల రాజశేఖర్
7032197896

అదో మొండిఘటం
ఎప్పుడూ నా మాట వినదు
అందుకే గొలుసులతో కట్టి
వెంటే తీసుకెళుతుంటాను
ప్రయాణంలో అడ్డమొచ్చిన
ముళ్లకంపలను వదిలించుకోవడానికి
దాన్ని బుద్ధి మార్చుకోమంటాను నేను!
అది వింటేగా ! ఏం చేస్తాం ?
దానిది విప్లవవర్తనం
నాది విలువల పరావర్తనం
చిక్కుల చీకటి గదిలో
కాంతిని వెతుకుతుంటాను నేను
ఇంకాస్త మరుగవుతుంటుంది
ఆశల వేసవి వేడిలో
జ్వలించిపోతుంటాను నేను
వెన్నెలకై వేచి కూర్చుంటుంది
గమ్యమెరుగని ప్రయాణంలో



వెనక్కు తిరిగి మురిసిపోతుంటాను నేను
ఫక్కున నవ్వి వెక్కిరిస్తుంటుంది
అదంతే! ఎప్పుడూ నా మాట వినదు
ఎప్పటికీ నేనూ దాని మాట వినను
అయినా అప్పుడప్పుడూ
దాని స్వేచ్ఛ హరించే హక్కు
నాకేదని ప్రశ్నించుకుంటాను!
ఈ "మనఃసంఘర్షణ" కి అంతం
దానితో ఏకీభవించినప్పుడే!
లేకుంటే అది నేను
రైలుపట్టాల్లా ఇలా ఎన్నాళ్లైనా...!



"ఇంట సుఖము లేక ఒంట సుకము లేక/ఆలు బిడ్డ లెంతో అలుమటింపు/శ్రమకు దగ్గ కీర్తి సంపదలును లేక / బ్రతుకు బండలైన భగ్నజీవి" (శిల్పి .పుట : 27)

అని శిల్పి వాస్తవిక జీవితాన్ని, చేసే పనిలో అతనికి ఉన్న అంకిత భావాన్ని జి. యాదగిరి ఆవిష్కరించారు. ఉలి దెబ్బలకు ఓర్చుకున్న ఏ శిలనైనా అందమైన శిల్పంగా రూపుదాల్చుతుంది. అలాంటి శిల్పాలను, శిల్ప నిర్మాణాలను చూసిన ఏ మనిషి పరవశానికి లోనుగాకుండా ఉండలేడు. వారి మనోభావాలతో వచ్చే ఆలోచనల్ని ఒక దగ్గర చేర్చితే ఎన్నో 'శిల్పి' ఖండ కావ్యాలవుతాయి. కానీ శిల్పి అంతరంగాన్ని స్పృశించిన జి. యాదగిరి శిల్ప నైపుణ్యాలను ప్రశంసించడం వరకే ఆగిపోలేదు. శిల్పి బాధల కొలిమిని కూడా తవ్వి చూసాడు. 'ప్రశంసా పర్వం'లో శిల్ప నైపుణ్యత, చతురతలను ప్రశంసించారు. సంసార పర్వంలోని లొసుగులను తూచే ప్రయత్నం చేశారు. 'పరామర్శ పర్వం' లో ఓదార్చే ప్రయత్నం చేశారు.

"వసుధ నెల్ల శిల్పాలతో స్వర్గ నమము/చేసితివి కాని నీ పేరు చెక్కలేదు/పేర్మి లేనట్టి రాజుల పేరే నిలిచె/ శిల్పి! నీవెంత నిస్వార్థ జీవివయ్య!" (శిల్పి. పుట. 30)

ఏ కోశానా స్వార్ధ చింతనలేని శిల్పి గొప్పతనాన్ని రెడ్డి రాజులు కీర్తిని సంపాదించుకున్నారు. కానీ కష్టజీవియైన'శిల్పి' మాత్రం అనామకునిగా మిగిలిపోయాడని తెలిపారు. అలాంటి అనామకునిగా మిగిలిపోయిన శిల్పి చేత తీర్చిదిద్దబడిన అశోకా చక్రం రాజముద్రం కావడంతో ఆహో శిల్పికి ఇలాగైనా కొంత గుర్తింపు వచ్చిందని రచయిత జి.యాదగిరి కొంత సంతోషాన్ని పొందారు. ఏది ఏమైనా రచయిత చెప్పాలనుకున్న విషయాన్ని సూటిగా, సున్నితమైన పదాలతో చెప్పి 'శిల్పి' అంతరంగాన్ని విప్పిన ఈ రచన పాఠకుల హృదయాల్లో చెరిగిపోని శిల్ప సౌందర్యాలను నింపుతుందనటంలో సందేహమే లేదు.



# ఆధునిక కవిత్వం - రజకుల స్థితిగతులు



*ఆధునిక కవిత్వం రజకుల స్థితిగతులను విమర్శకు పెట్టింది. వృత్తిపని విధానం, వృత్తి పదజాలాన్ని అక్షరీకరించింది. బట్టలకంటిన మురికిని, మైలను చౌడునీళ్ళల్లో ఉడకబెట్టి, ఉతుకుడు బండకేసి బాది మిలమిలలాడించేది రజక వృత్తి. ప్రతి రజక కుటుంబానికి మిరాశి కుటుంబాలుంటాయి. వారికి తప్ప ఇతరులకు ఉతకరు. నిర్ణీత మేర ఉంటుంది. అదే వారి జీవనాధారం.*

**- మూలె విజయలక్ష్మి**
**- బి. లక్ష్మిప్రియ**

అనాదిగా కులం, వృత్తి పరస్పరాశ్రితాలుగా కొనసాగాయి. విద్య, ఉద్యోగాలు, వ్యాపారకారణాల వల్ల ఆ బంధం బిగువు సడలింది. ప్రతి కులానికి ఒక సామాజిక ప్రతిపత్తి ఉంది. ప్రతివృత్తి సామాజిక అవసరంగా ఉంది. పులి కొండ సుబ్బాచారి కుల పురాణాలులో సామాజిక నిర్మితిలో రజక కులం, సామాజిక ప్రతిపత్తి, స్థానాన్ని బట్టి శ్రేణీకరణంలో ఆరవస్తరంలో సూచించారు. పద్మసాలె, దేవాంగ, యాదవ, కమ్మరి, కుమ్మరి చాకలి కులాలను ప్రభుత్వం బి.సి కమీషన్ సామాజికంగా వెనకబడిన కులంగా గుర్తించారు. స్థానాన్ని, సామాజిక అంతస్తును ఉన్నతీకరించుకునే క్రమంలో కుల నామాలు సంస్కృతీకరించుకోబడినాయి. చాకలి-రజకులు, మంగలి-క్షురక-నాయిబ్రాహ్మణ, కంసాలి-విశ్వకర్మ, జాలరి - మత్స్యకార మొదలైనవి వృత్తి నైపుణ్యం వృత్తికారుల్లో పుష్కలం, కులం వంశపారంపర్యం వృత్తిఐచ్ఛికం, కులం వృత్తి అవినాభావ సంబంధం చాలా కాలంగా ఉండటం వల్ల నైపుణ్యం అలవడుతుంది. పుట్టినప్పటి నుంచి వృత్తి పనులను గమనిస్తూ, అనుభవిస్తూ ఉండడం వల్ల అలవోకగా అబ్బుతుంది. వివిధ రకాల వృత్తుల వాళ్ల అల్లిబిల్లిగా అల్లుకొన్న అనుబంధం, పరస్పర సహకారం, సమైక్యత పల్లెల్లో ముప్పరికొని ఉండేది. ప్రపంచీకరణ నేపథ్యంలో కులవృత్తులకు ఆదరణ సన్నగిల్లడం, ఇతర వ్యాపకాలపై మొగ్గు చూపడం తమ సామాజిక ప్రతిపత్తిని పరామర్శించుకునే చైతన్యం రావటం వల్ల కుల వృత్తిని పారంపర్యంగా చేపట్టడం తక్కువవుతోంది.

ప్రతి వృత్తిలో ఆధునికీకరణ యాంత్రీకరణ చోటుచేసుకుంది. దీనివల్ల వృత్తి దార్లకు కడుపునిండని పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఇలాంటి స్థితి రజక, కుమ్మరి, పద్మసాలె, కమ్మరి మొదలైన కులాల్లో నెలకొనింది. ఆధునిక సాహిత్యం స్త్రీలు, దళితులు, బడుగు బలహీన వర్గాలు సమస్యల వైపు దృష్టి సారించడంతో వారి స్థితిగతులు ఇతివృత్తాలయ్యాయి. ఆయా కులాల నుండి రచయితలు కలం సాగించడం వల్ల అనుభూతి అనుభవసారం సాహిత్యంలో ప్రతిఫలించింది. ఈ కోవలో ఆధునిక కవిత్వం రజకుల స్థితిగతులను విమర్శకు పెట్టింది. వృత్తిపని విధానం, వృత్తి పదజాలాన్ని అక్షరీకరించింది. బట్టలకంటిన మురికిని, మైలను చౌడునీళ్ళల్లో ఉడకబెట్టి, ఉతుకుడు బండకేసి బాది మిలమిలలాడించేది రజక వృత్తి. ప్రతి రజక కుటుంబానికి మిరాశి కుటుంబాలుంటాయి. వారికి తప్ప ఇతరులకు ఉతకరు. నిర్ణీత మేర ఉంటుంది. అదే వారి జీవనాధారం. నేడు లాండ్రీలు, తోపుడు బండ్లపై ఇస్త్రీలు, డ్రై క్లీనింగ్ షాపులు వెలిశాయి. వారు నిర్ణయించిన ధర చెల్లించాల్సి ఉంటుంది.

శుభ్రపరచడానికి రకరకాల సబ్బులు డిటర్జంట్లు మార్కెట్‌లోకి వచ్చాయి.

రజకవృత్తిలోని సాదకబాదకాలను కత్తి పద్మారావు 'చాకిరివీరుడు'లో వర్ణించారు. రజకులు మామూలు మురికి బట్టలతో పాటు మలమూత్రాల బట్టలను ఉతికి అమ్మతనానికి నిలువెత్తు నిదర్శనంగా నిలిచాడంటారు.

మల మూత్రాలతో/మకిల బట్టిన బట్టలుతికి/ అమ్మతనానికి / ఆయువు పోసినోడు.

చౌడులో ఉడికించి, ఉతికిన బట్టలు సువాసన కలిగి ఉంటాయని, దండేలపై ఆరేసిన రంగురంగుల పట్టుచీరలు రంగురంగుల పట్టుచీరలు హరివిల్లను తలపించేవని ననుమానస్వామి 'నీలిబాల్యం'లో వ్యక్తీకరించారు.

*కాలం మారింది. వానలు కరువయ్యాయి. చెరువులు, వాగు వంకలు ఎండిపోయాయి. ఎండిన చెరువులు కబ్జాకోరల్లో చిక్కుకుపోతున్నాయి. దాంతో చాకలి వృత్తికి నెలవైన నీటివసతి కొరవడింది. వృత్తికి గండిపడింది.*

సౌదులో ఉడికించి, ఉతికిన బట్టలు ఆరేస్తున్నప్పుడు – పరిసరాలన్నీ పరిమళభరితమయ్యేవి–జిట్టీదులపై ఆరేసిన పట్టుచీరలు రంగుల హరివిల్లులు –

చౌడుమట్టి నీళ్ళలో గుడ్డలు ఉడకేసి, మురికిని వదలగొట్టే రజకున్ని రసాయన శాస్త్రజ్ఞునితో పోల్చారు. చౌడుమట్టిని / సున్నపుగడ్డ/కలిపిన కమ్ముతో / గుడ్డలుడకేసి/మురికిని పిండిన / రసాయన శాస్త్రజ్ఞుడు

**'చాకిరి వీరుడు'**

మూడ్రోజులకో, వారానికో ఇంటింటికెళ్ళి మురికి బట్టలు సేకరించి, ఉదయాన్నే నీటివనరుల దగ్గర చాకిరేవు పెట్టి పిల్ల జెల్లాతో కూడా పనిలో నిమగ్నమవుతారు. ఉతికి, ఆరబెట్టిన గుడ్డలు సాయంత్రానికి యాజమానుల ఇండ్లకు చేర్చుతారు. ఇంతగా కష్టపడినా బట్ట చిరిగిందనో, మురికిపోలేదనో, జేబులో డబ్బుపోయిందనో, చీవాట్లు తప్పవంటారు.

మట్టి మరక పోలేదని / నలిగి, చిరిగిపోయిందని / చీరమడతలోనో / చొక్కాజోబులోనో / ఉన్న సొమ్ము పోయిందని / చీవాట్లు చీదరింపులు – అదిరింపులు, బెదిరింపులు – 'చాకిరి వీరుడు'.

ఈ వృత్తి పని చేసినందుకు మిరాశీదార్లు నుంచి పంట పండినపుడు ఇచ్చే మేర కూడా చాలా తక్కువ. మీరాశీదార్లు సాయంత్రం అన్నం పెట్టడం ఆనవాయితీ. అదైనా ఉడుకు అన్నం కాకుండా పాసిన అన్నం పెడతారని, దాని వల్ల అనారోగ్యం కలుగుతుందని, చాకిరీలో ఒళ్ళుగుల్లయి పోతందంటున్నారు.

పాసిన కూటి కోసం / నిలువెల్ల చాకిరీ చేసి

కృతఘ్నుల సేవలో / మగ్గి బుగ్గయి/ జీవన సంస్కృతంతా / గుల్ల చేసుకున్నోడు – చాకిరీ వీరుడు

సమర్తయినా, పెండ్లయినా/పురుడైనా/ మొత్తం మురికిని పిండి/ఆరేస్తూ అగ్రజుడు/కూలికొలత లేనోడు – శ్రమకు తగిన ప్రతిఫలం కూడా ఆశించని రజకుని శ్రమతత్వాన్ని వ్యక్తీకరించారు కత్తి పద్మారావు.

చౌడుమట్టిలో మురికిని పోగొట్టే లక్షణాలను గుర్తించిన రజకుడు గాడిద పెంటతో డిటర్జంట్‌లను చేసే పరిజ్ఞానాన్ని పొందాడు. వివిధ చేతి వృత్తుల నైపుణ్యాన్ని మలినమైన పనులను చేస్తున్న సహనాన్ని గుర్తించటం లేదని 'మాకూ ఒక భాష కావాలి'లో తుల్లి మల్లి విల్సన్ సుధాకర్

"గాడిద పేడతో/డిటర్జంట్లు చేసే రజకుల మేధస్సుని" పొగిడారు.

పురిటిమైలబట్టల నుండి మకిల బట్టిన బట్టలు తీసుకెళ్ళి చాకిరేవు పెడతారు. సాధారణంగా చెరువులు నీటికుంటల దగ్గర చాకిబండలను ఏర్పరచుకొని ఉతుకుతారు. ఉన్నవారి బట్టలకైనా, లేని వారి బట్టలకైనా రేవు బండ ఒకటే. బట్టల రకాలను బట్టి వేరు చేసి ఉబ్బపెట్టి సౌడుమట్టి కలిపిన నీళ్లలో తడిపి, వడతిప్పి నీళ్లు పిండి, మడిచి బానలో సగానికి పైగా నీళ్లు పోసి, మడిచిన గుడ్డలు పేర్చి ఉడకబెట్టి ఉతుకుతారు.

'మా ఊరు మొలకెత్తింది' కవితలో ఒక అంచున చాకిరేవు ఊరందరికి అదొకటే / మా చాకలి రావమ్మకు / ఉన్నవారి పట్టుకోక/లేనివారి గోటురైక / అన్నింటికీ రేవొకటే బండొకటే / అని వృత్తి పనిలో సమత్వాన్ని తెలిపారు హనుమారెడ్డి.

కాలం మారింది. వానలు కరువయ్యాయి. చెరువులు, వాగు వంకలు ఎండిపోయాయి. ఎండిన చెరువులు కబ్జాకోరల్లో చిక్కుకుపోతున్నాయి. దాంతో చాకలి వృత్తికి నెలవైన నీటివసతి కొరవడింది. వృత్తికి గండిపడింది. అందుకే గోరటివెంకన్న

"వాగులు వంకలు ఎండిపోయినయ్; చాకలి పొయ్యిలు కూలిపోయినవి" అంటారు.

ఉతకడానికి వేసే గుడ్డలు పలురకాలుగా ఉంటాయి. ఉతికిన తర్వాత అవన్ని జాగ్రత్తగా యజమానులకు చేర్చే బాధ్యత రజకునిదే. గుడ్డలు కలిసి పోయి ఒక ఇంటివి మరో ఇంటి వాళ్ళకు అందివ్వకుండా ఉండడానికి ఇంటికో గుర్తు వేసుకుంటారు. గుర్తును బట్టి వేరు చేసి, ఆయా ఇళ్ళ వారీగా చేరవేస్తారు. గుర్తులు వేయడానికి జీడిగింజలు వాడతారు. కాల్చిన జీడిగింజను సూదితో లేదా పిన్నుతో గుచ్చి ఆ రసంతో ఒక్కో ఇంటికి చుక్క, గీతలు లాంటివి వేసి, గుర్తు పెట్టుకుంటారు. ఒకసారి జీడిగింజ రసంతో గుర్తు వేస్తే గుడ్డ చిరిగి పోవాల్సిందే తప్ప గుర్తు చెరిగిపోదు.

*గుడ్డలు కలిసి పోయి ఒక ఇంటివి మరో ఇంటి వాళ్ళకు అందివ్వకుండా ఉండడానికి ఇంటికో గుర్తు వేసుకుంటారు. గుర్తును బట్టి వేరు చేసి, ఆయా ఇళ్ళ వారీగా చేరవేస్తారు. గుర్తులు వేయడానికి జీడిగింజలు వాడతారు. కాల్చిన జీడిగింజను సూదితో లేదా పిన్నుతో గుచ్చి ఆ రసంతో ఒక్కో ఇంటికి చుక్క, గీతలు లాంటివి వేసి, గుర్తు పెట్టుకుంటారు.*

కిర్రుచెప్పుల భాషలో శిఖామణి జీడిగింజతో వేసే చెరగని గుర్తులాగా జాతి వస్త్రంపై చాకలి సంతకం చేస్తున్నాను అంటున్నారు.

ఇప్పుడు అక్షరాన్ని / కాల్చిన జీడిగింజను చేసి/జాతి వస్త్రం మీద / నా చాకలి సంతకం చేస్తున్నాను.

చాకలికి బట్టల మూటలు మోయడంలో అండగా నిలిచేది గాడిద అధిక బరువును గాడిద బరువు అనీ, అధిక శ్రమను గాడిద చాకిరీ అనడం జనుల వాడుక. ఉప్పు వ్యాపారస్తులు మూటలను గాడిద పై వేసి ఊరూరు తిరుగుతుంటారు. గాడిదలు సాకే స్తోమత లేని రజకుడు తన వీపు పైనే మూటలు వేసుకొని, చాకిరేవుకు తీసుకెళతారు. పసిపిల్లలు, కాటికి కాళ్ళు చాపిన వృద్ధులు మలమూత్రాలు గుడ్డల్లో పోతుంటారు. అవి కూడా రజకుడు మూట కట్టి వీపున వేసుకొని రేవుకు తీసుకెళ్లి చాకిరి చేస్తారు.

పురిటి పిల్లల్నుంచీ / కాటికి కాళ్లుజాపిన / ముసలోల్ల దాకా ఉచ్చా పీతి గుడ్డల్ని / వీపున మోసే గాడ్దెలం/ అని ఆవేదన చెందుతున్నారు. పి, దస్తగిరి 'మేసాకలోళ్లం' కవితలో

బట్టల మలినాన్ని పోగొట్టి ముత్యాల్లాగా మార్చడమే కాకుండా, యజమానుల ఇండ్లలో శుభ కార్యాల్లోను, గ్రామాల్లో జరిగే ఉత్సవాలు, జాతర్లలో రజకులకు నిర్ణీత ప్రమేయముంటుంది. దేవుని ఉరేగింపులో, బలిజంతువులను గుడికి తీసుకెళ్ళేటప్పుడు ముందు రజకుడు దివిటీ పట్టుకెళ్ళడం ఆనవాయితీ. కొన్ని ప్రాంతాలలో గ్రామదేవతలకు పూజారులుగా ఉన్నారు.

దేవరెద్దు ఉత్సవాల్లో ఎద్దు అడుగు కింద పెట్టకుండా మడుగు పరచడం, గ్రామదేవతల జాతర్లలో దుప్పట్లు పరచడం, దేవుని ఊరేగింపులో వాహనాలు మోయడం, పండుగలకు గుడిగుమ్మాల్లో తోరణాలు కట్టడం వంటి పనులు వీరివంతు.

దివిటీపట్టే టోడు / పల్లకి మోసేవాడు – 'చాకిరి వీరుడు'. మడేలు దుప్పట్లు మడువుతో గ్రామదేవతలు ఆనందించిరి – మా ఊరు మొలకెత్తింది.

ఏ పండుగొచ్చినా, పబ్బ మొచ్చినా / గుడిగుమ్మాల కాడ / శోభతో స్వాగతించే మామిడి తోర ణాలం / ఉత్సవ ఊరేగింపులలో / రాములోరిని / భుజాలపై వీధివీధికి మోసే హనుమంతులం – మేం సాకలోళ్లం – పి.దస్తగిరి.

మిరాశిదార్ల ఇళ్లలో పెళ్లి పేరంటాలకు రజకులు సేవలందించాలి. పూర్వం శుభకార్యాలు వీరిప్రమేయం లేకుండా జరిగేవి కావు. నిర్ణీత పనులు తప్పక చేయాల్సి ఉండేది. ఆడపిల్లలు సమర్త అయినప్పుడు మైల గుడ్డలు పిండడం, నలుగు రోజు పీటలకింద వస్త్రాలు పరచడం, వంటి పనులు చేయాలి. గ్రామాల్లో ఈ ఆచారాలు కొంత తగ్గుముఖం పట్టాయి. పట్టణాల్లో ఆచారాల పట్ల ఆసక్తి తగ్గింది. మారుమూల గ్రామాల్లో సంప్రదాయాల పట్ల పట్టింపులున్న కుటుంబాల్లో ఇంకా కొనసాగుతున్నాయి.

పెండ్లికి కబురు చెప్పేటోడు / ఇంటికి వెల్ల వేసేటోడు – చాకిరి వీరుడు

మా బతుకుల్లో వెలుగులేకున్నా / మీ పెళ్ళిళ్లకూ పేరంటాలకూ / చీకటిని తరిమి వెలుతురునిచ్చే దివిటీలం – 'మేం సాకలోళ్ళం'.

ఇంటి చాకలి కళ్యాణ వేదిక సిద్ధం చేశాడు. – మా ఊరు మొలకెత్తింది.

పల్లెల్లో వివిధ కులవృత్తుల వాళ్ళు, పరస్పరాధారితంగా

అక్క, బావ, మామ అనుకుంటూ సుహృద్భావవాతావరణంలో ప్రశాంత జీవనం గడిపేవారని, స్థాయి భేదాలు లేవనీ, ఉత్పత్తిలో శ్రమవిభాగ వ్యవస్థ అని, రైతులు వారిని చేరదీసి అభిమానించేవారని, రైతుకు అండగా అన్ని వృత్తుల వారు సహకరించే వారని మా ఊరు మొలకెత్తింది లో హనుమారెడ్డి పేర్కొన్నారు.

కుమ్మర్లు కమ్మర్లు / చాకళ్ళు మంగళ్ళు / అందరూ సహజీవనం చేసేవారు / ఎవరైతేనెం తేడాలు తక్కువ/ మక్కువలు ఎక్కువ / ఎవరిపని వారిదే / శ్రమవిభాగ వ్యవస్థ అది / శాంతం – ప్రశాంతం / వేతల్లో కోతల్లో ఏకత్వం.

అయితే కోలపూడి ప్రసాద్ అగ్ర కులస్థుల మధ్య కుల వృత్తిదారుల జీవితం దుర్భరంగా ఉంటుందని వర్ణించారు. వందపులులు మధ్య మేకలా / వేయి మంది అగ్రకులస్థుల మధ్య ఒక చాకలిగా/ కుమ్మరిగా/మంగలిగా బతకడం ఎంత దుర్భరం.

రజకులకు గుడ్డలుతికే కుటుంబాలు నిర్దేశితంగా వుంటాయి. మిరాశీదార్లు అంటారు. వారికి తప్ప ఇతరులకు ఉతకరు. రజక కుటుంబం భాగాలు పోతే మిరాశీ ఇళ్లు పంచుకుంటారు. మిరాశీదార్లు రజకుల శ్రమకు సంవత్సరానికి 'మేర' ఇస్తారు. సాధారణంగా రైతులైతే పంట పండిన తర్వాత నిర్ణీత ధాన్యం ఇస్తారు. కరువు కాటకాలతో, రైతు పంట కళ్ళచూడడమే గగనంగా మారింది. అలాంటప్పుడు నెలవారి గాని, గుడ్డకింత అని డబ్బు రూపంలో చెల్లిస్తారు. కుటుంబమంతా చాకిరీచేస్తే దక్కేది పరిమిత ప్రతిఫలమేనంటున్నారు కత్తి పద్మారావు చాకిరీ వీరుడులో.

సంవత్సరానికొకతూరి / తూమెడు గింజలు కొలిస్తే/ కుటుంబానికంతా/నిస్వార్థంగా/ చాకిరీ చేసే / అవిశ్రాంత శ్రామికుడు.

ఇంటిపనితోపాటు వృత్తిపనిలో రజక మహిళ భాగస్వామ్యముంది. రజక స్త్రీలు సాయంత్రం పూట అన్నం పెట్టించుకురావాడానికో, గుడ్డలు తెచ్చుకోడానికో, ఇవ్వడానికో మిరాశీ ఇండ్లకు వెళ్ళినపుడు, పురుషుల కన్ను పడకపోదు. కన్ను పడిందంటే వేధింపులు తప్పవు. అఘాత్యాలకు గురికావచ్చు. చెల్లెలి పైనో, భార్యా పైనో అఘాయిత్యం జరిగినా, ఎదిరించలేని నిస్సహాయతను కత్తి పద్మారావు 'చాకిరివీరుడు'లో పేర్కొన్నాడు.

సంధ్యకాంతుల్లో / గుడ్డలు మడతేసి/చీకటి పోరల్లో అఘాయిత్యానికి గురైన / చెల్లెలి ఆక్రందనను / గుండెల్లో దాచుకునే నిస్సహాయనిర్భాగ్యుడు/

తెలంగాణాలో దొరలదోపిడీ తనాన్ని, దౌర్జన్యాన్ని ప్రతిఘటించిన సాహస వనిత ఐలమ్మ. పంట పొలాన్ని దోపిడీ చేయకుండా పోరాడి దక్కించుకుంది. వినుసూర్ దేశ్‌ముఖ్ ఐలమ్మపై పగ తీర్చుకోవడానికి ఆమె భర్తను, ఇద్దరు కొడుకులనీ హత్యాయత్నం కేసులో ఇరికించారు. కూతురు సోము నర్సమ్మ పై అత్యాచారం చేయించారు. అయినా ఐలమ్మ జంకలేదు. సంఘం పెట్టి ఎర్ర జెండా ఎగురవేసింది. తర్వాతి తరాలకు స్ఫూర్తిగా నిలిచింది.

***వినుసూర్ దేశ్‌ముఖ్ ఐలమ్మపై పగ తీర్చుకోవడానికి ఆమె భర్తను, ఇద్దరు కొడుకులనీ హత్యాయత్నం కేసులో ఇరికించారు. కూతురు సోము నర్సమ్మ పై అత్యాచారం చేయించారు. అయినా ఐలమ్మ జంకలేదు. సంఘం పెట్టి ఎర్ర జెండా ఎగురవేసింది. తర్వాతి తరాలకు స్ఫూర్తిగా నిలిచింది.***

నా బువ్వ గుంజుకున్నందుకు/ బువ్వ గింజల పోరాటం జేస్తా / బువ్వ గింజల చాకలి ఐలమ్మ/ మొదటి నెత్తుటి చుక్క – దొడ్డి కొమురయ్యాలు / మే మే / అంటున్నారు. 'నేను బహువచనం' కవితలో జూలూరి గౌరీ శంకర్.

తల్లికి పాలులేనపుడో, తల్లి మరణించిన సందర్భాల్లోనో రజక స్త్రీలు తమ పాలు పట్టి యజమానుల పిల్లలను పెంచిన సందర్భాలు అనేకం. పెరిగి పెద్దయ్యాక ఆ పిల్లలు వారి పై కృతజ్ఞత చూపడం సహజం చనుబాలతోనా మేను పెంచిన చాకలమ్మకు దండాలు / నన్నుపెంచిన చాకివంటేనే నాకు ప్రేమ –అంటూ ననుమాసస్వామి 'నీలి బాల్యం'లో కృతజ్ఞత అర్పించారు.

మురికి బట్టలను ముత్యాల్లాగా, తీర్చినా వీరికి దక్కే గౌరవం దక్కటం లేదని, ఒరే , ఒసే, అని పిలుస్తూ, కించపరుస్తున్నారని ఆవేదన వ్యక్త పరుస్తున్నారు. 'మేం సాకలోళ్ళం' కవితలో పి. దస్తగిరి ఉత్తమపురుషలో సాగిన కవితలో మాకూ ఆత్మాభిమానముంది. గౌరవించండి అని నివేదించుకున్నారు.

ఒరే చాకలి/అన్న మీ గద్దింపులకు / సెప్పురెడ్డీ అంటూ పలికి/మానాన్ని సంపుకున్న / మనుషులం / ఇంగొద్దు చాలు / మేము ఆత్మాభిమానమున్నోళ్ళమే / మనసున్న మనుషులమే / మమ్మల్ని గుర్తించండి/గౌరవించండి.

# కొత్త దేహాలు

- డా॥ పెళ్ళకూరు జయప్రద సోమిరెడ్డి
9440279594



శవాన్ని పోస్ట్‌మార్టమ్ చేస్తే.....
సిరలగుండా స్నేహ తత్వాన్ని
దమనుల గుండా మానవత్వాన్ని
కిడ్నీ నాళాల గుండా కృతజ్ఞతని
పారబోసుకున్న కొత్త మనిషిని చూసాను

పేగుల నిండా ఆహారం కాదు.. దౌర్జన్యాల పాము బుసలు
స్పీన్ ప్లేస్‌లో పగ, ప్రతీకారాలు
కిడ్నీస్థానంలో కుళ్ళు, కుతంత్రాలు
గర్భసంచి దేవాలయంలో హంతకుల ఆయుధాలు
అసలు లివర్ ఎక్కడ..?
ఆ స్థానంలో ఇల్లీగల్ న్యాయస్థానం తప్ప
ఊపిరితిత్తులు ఎలా శ్వాసించాయో తెలీదుగానీ...
టిష్యూని ఊగిస్తే,
మానభంగాల ఆర్తనాలు రాలిపడ్తున్నాయి

చిత్రం !
గుండె కొట్టుకుంటోంది.. లబ్‌డబ్ అనికాదు..
డబ్బు డబ్బు అని
కపాలం పగలగొట్టి చూస్తే..
మానవత్వపు మెదడు మరణించినట్టుంది
అవినీతి, అన్యాయం... దుర్మార్గం, దానవత్వం..
స్వార్థం, సంకుచితత్వం....
వీటిని అందంగా అమర్చి, కుట్లు వేసుకున్న కొత్తదేహాలవి

మనిషి అంటే ఒక ముఖం ఒక దేహం కాదు
నిలువెత్తు వ్యక్తిత్వం, మానవత్వం, సేవాతత్వం
ఎవరు ఏ మంత్రం వేస్తారో తెలీదుగానీ...
బండరాయి
స్థానంలో హృదయం ఎప్పుడు ప్రతిష్టించబడ్తుందో!

---

రజకులకు సంఘాలున్నాయి. వర్గ చైతన్యం కల్గింది. తమ స్థితిగతులపై ప్రశ్నిస్తున్నారు. భూస్వామ్య పెత్తందారీ వ్యవస్థను పట్టణాల్లో పెట్టుబడి దారి వ్యవస్థను ధిక్కరిస్తున్నారు. కులవివక్షను వ్యతిరేకిస్తున్నారు. ఆర్థిక, సామాజిక రంగాలలో సమత్వాన్ని కోరుతున్నారు. రజక స్త్రీలు పోరాటాల్లో పాల్గొంటున్నారు. తమ కులాన్ని హీనంగా చేసే కుల అహంకారాన్ని తత్వాన్ని బూర్జువాతనాన్ని దెబ్బకొట్టి తీరుతామని, బట్టల మురికిని పొగొట్టే రజకులకు అది కష్టం కాదని పి. దస్తగిరి మేం సాకలోల్లంలో నినదించారు.

దేవర దున్నపోతునే కాదు / కులహంకారాన్ని ఒక్క వేటుతో / నరికే వేట కొడవళ్లం / మనసుల్ని గుచ్చే మీ మాలిన్నమైన మాటలను / రోగాళ్లమై మోసుకెళ్లి చాకలి పొయ్యిలో కాల్చే పంగల కర్రలం / కాదంటే / బండకేసి బట్టల్ని ఉతకటం / బాగా తెలిసినోళ్ళం / మీ బూర్జువాతనాన్ని ఉతకటం / మాకేం కష్టం కాదు/

వివిధ కుల వృత్తుల వారు వృత్తిని వదలి విద్య, ఉద్యోగాల వైపు దృష్టిపెడ్తున్నారు. శ్రమదోపిడీ, ఆధిపత్య భావజాలం నిండుకున్న అగ్రకులస్థులకు అది కడుపు మంట కలిగించిందని ఏ.వై.ప్రభు 'మెరిటంటే ఏందిరో' కవితలో వ్యక్తీకరించారు.

సాలోల్లు, సాకలోల్లు, ఉప్పరోల్లు, వడ్డెరోల్లు, మంగలోల్లు – మాదిగోల్లు, ఎరుకలోల్లు, లంబడోల్లు.... ఉద్యోగం చేస్తుంటే కడుపుమండిందిరో/

ఆధునిక కవిత్వంలో రజకుల స్థితిగతులను అవలోకిస్తే రెండు కోణాలు అవగతమవుతున్నాయి. అనాదిగా సంప్రదాయ వృత్తిదారులకు వృత్తే జీవనాధారం. అరకొర ఆర్థిక వెసులుబాటుతో శ్రమ దోపిడీలో మగ్గారు. పెత్తందారీ వ్యవస్థ ఆధిపత్యంలో, వృత్తి నైపుణ్యం అగౌరవింపబడింది. నేడు శ్రమ విలువను, ఆర్థిక అసమానతను పసిగట్టి చైతన్య వంతులయ్యారు. అన్యాయాన్ని నిలదీస్తున్నారు.

పారిశ్రామికీకరణ, యాంత్రీకీకరణ కుల వృత్తులను దెబ్బకొట్టాయి. రజక వృత్తి విధానంలో మార్పులొచ్చాయి. పల్లెలకు పట్టణాలకు రజక వృత్తిలో తేడా ఏర్పడింది. పల్లెల్లో సంప్రదాయ పద్ధతిలో కులవృత్తి కొనసాగుతుండగా, పట్టణాల్లో ఇళ్లలో వాషింగ్‌మెషిన్ వాడుతున్నారు. లేదా ఉతికించుకుంటున్నారు. ల్యాండ్రీలు, ఇస్త్రీ బండ్లు వీధివీధినా వెలిశాయి. రజకులు నిర్ణయించిన ధర చెల్లించవలసి వుంటుంది. అయితే యాంత్రీకీకరణ వృత్తిదారుల పొట్ట కొట్టిందనీ, డ్రై క్లీనింగ్ ఆదాయ వనరుగా భావించి రజకులే స్థిరపడ్తున్నారు. ఏమైనప్పటికీ పట్టణాల్లో వృత్తి పని ఆధిపత్య వ్యవస్థ కబంధ హస్తాల నుండి విముక్తి పొంది, స్వేచ్ఛ వాయువులు పీల్చుకొంటుందనవచ్చు.

# రైతు జీవితం



గంభీరావుపేట యాదగిరి
9618213611

మారాలి - మారాలి మా రైతు బతుకులు
చేరాలి - చేరాలి మా రైతు మోముపై చిరునవ్వు కాంతులు,
కన్నీళ్ళు తుడవాలి రైతు కన్నులలో
కలకాలముండాలి సల్లంగ రైతు ఈ భువిలో

పెట్టుబడి లేక, గిట్టుబాటు కాక,
నెట్టుకొని రాలేక
చిన్నబోయే నేడు సన్నకారు రైతు,
విత్తనాల కొరకు విసిగివేసారినా
నకిలీల బారినపడి నష్టపోయే రైతు,
పండించిన పంటంతా దళారుల పాలంట
ధర నిర్ణయించే హక్కు దళారులకేనంట॥

కాలుష్యపు కోరల్లో, చిక్కుకున్నవాన
అన్నదాత పాలిట శాపమాయె;
పాతాళగంగకై పరితపించే రైతు
భగీరథుడయ్యినా భంగపడే నేడు,
ఆలికున్న తాళిసైతం తెగనమ్మినాగాని
అప్పుదీరక రైతు ఆగమయ్యె॥

ధాన్యరాశులు బోసి చూసి మరుసుడె గాని
ఇల్లు జేరుడెన్నడెరుగడాయే రైతు,
క్వింటాళ్ళ ధాన్యాన్ని పండించినా గాని
కంట్రోలు బియ్యంతో బతుకు సాగుడాయె,
సాహుకారు అప్పు కొండయ్యి కూర్చుండె
సహకారమందించ సర్కారు రాదాయె॥

అతివృష్టి - అనావృష్టి
పంటలన్ని ఆగమాయె
ఆదాయమే లేక
అప్పులన్ని భారమాయె,
దేశానికే అన్నంపెట్టిన రైతు
దేహియంటూ నేడు చేయి చాపుడాయె,
ఉపాధి లేక ఊరిడిసిన రైతు
నగరాన చేరి, చెరుకు రసంబండ్లు నడుపుడాయె,
గతికి లేక బతుక - 2
గేటుకాడ వాచుమేను ఉద్యోగమే దిక్కాయె
రైతు దుస్థితికి రుజువులీదృశ్యాలు సోదరా
ఎండనక వాననక, చలిని సైతం లెక్కసేయక
త్యాగాల జడిలోన
తడిసి ముద్దయ్యె కష్టజీవి అన్నదాత;
కట్టుకొను బట్టలేక
కన్నవారికి తిండి పెట్టలేక,
కార్పొరేటు చదువు
ఖర్చు పెట్టి కొనలేక,
గంజనీళ్ళు తాగిబతికే
గరీబోళ్ళు నేడు రైతులైరి,
ఆత్మహత్యలే ఆధారమయ్యి
అసువులు బాయజూసే - అన్నదాత॥
నిరక్షరాస్యత నిలువుదోపిడీ లేని
నిర్ధనతనునది నిండ ముంచునట్టి,
కరంటు కష్టాలే కానరాకుండ
నీటి కొరత లేక మేటి బతుకులు సాగ
విత్తనాల కొరత వెక్కిరించనట్టి
వలసలే లేకుండా స్వావలంబన కలిగి,
రైతులే రాజులై-2 రాజ్యమేలే దిశగ
సాగాలి - సాగాలి చైతన్య రథము
చూడాలి చూడాలి రైతుబాంధవులు మంచి తరుణాలు
మా - రైతు - సోదరుల - మంచి - తరుణాలు



# రాయలసీమ ఆధునిక సాహిత్యానికి ముద్రణా నిలయాల కొరత

- డా॥ పొదిలి నాగరాజు

9052038569



*సాహిత్యాన్ని సమాజానికి అందించేవి పత్రికలు, పుస్తకాలే. అయితే వీటికి రూపాన్ని అందించేవి మాత్రం ముద్రణా సంస్థలు. ఇవి తప్పనిసరిగా ఉండాలి. ఇవిలేని పక్షంలో ఆ ప్రాంతం నుండి ఎంత గొప్ప సాహిత్యం వచ్చినా అది ఏ ప్రాంతానికి తెలియకుండా మరుగున పడిపోతుంది. ప్రపంచంలో క్రీ.శ. 1041 చైనాలో బిషెంగ్ అనే వ్యక్తి మొదటి ముద్రణానిలయాన్ని స్థాపిస్తే, 1377 కొరియాలో డైనార్టీ స్థాపించిన ముద్రణా సంస్థ రెండవదని చారిత్రక ఆధారాలవల్ల తెలుస్తుంది. ఈ రెండింటి తర్వాత గూటన్‌బర్గ్ 1456 జర్మనీలో ముద్రణా సంస్థను నెలకొల్పాడు.*

సాంస్కృతిక పునరుజ్జీవనం ఆధునిక యుగానికి పునాదిరాయి. పారిశ్రామిక విప్లవం కొత్త జీవన విధానానికి మొగ్గతొడిగింది. అచ్చుయంత్రం ప్రభావం అటు సమాజంలో సాంకేతిక పరిజ్ఞానానికి, సాహిత్యంలో నూతన ప్రక్రియలకు శ్రీకారం చుట్టింది. వీటివల్ల పాశ్చాత్య సంస్కృతి భారతదేశంలో ఛాందస భావజాలాన్ని తరిమేసి సంస్కరణవైపు అడుగులు కదిపేలా చేసింది. 19వ శతాబ్దం భారతదేశంలో ఒకవైపు సంస్కరణవాదం, మరోవైపు స్వాతంత్ర్య పోరాటం ఏకకాలంలో మొదలయ్యాయి. ఈ రెండింటిలోని ఆంతర్యాన్ని, సారాంశాన్ని ప్రజలకు తెలియజెప్పడానికి దేశంలో ముద్రణా నిలయాలు, పత్రికలు వెలువడ్డాయి. ముఖ్యంగా పత్రికలను ఆయుధంగా చేసుకొని ఎంతోమంది స్వాతంత్ర్య సమరయోధులు, సంఘసంస్కర్తలు కలం ద్వారా తమ గళాన్ని వినిపించడానికి ముందుకు వచ్చారు. ఈ నేపథ్యంలో నుండి వచ్చినవే నవల, కథ, విమర్శ, వ్యాసం లాంటి ఆధునిక ప్రక్రియలు. పాత సాహిత్య ప్రక్రియలను పక్కకునెట్టి క్రొత్త సాహిత్య ప్రక్రియలు "పాత యేటికి కొత్తనీటి"లా దేశంలోని అన్ని ప్రాంతాలకూ విస్తరించుకొన్నాయి. ఈ నేపథ్యంలో ఎంతోమంది రచయితలు ప్రపంచస్థాయి రచనలను రచించి సమాజంలో ఎంతో మార్పును తీసుకొని వచ్చారు. భారతదేశంలో ఈ ఆధునిక ప్రక్రియలను ప్రారంభించింది బెంగాలు ప్రాంతమే అయినా వాటిని వ్యాప్తి చేసే కృషిలో మాత్రం ఆంధ్రదేశానిదే ప్రముఖస్థానం.

సాహిత్యాన్ని సమాజానికి అందించేవి పత్రికలు, పుస్తకాలే. అయితే వీటికి రూపాన్ని అందించేవి మాత్రం ముద్రణా సంస్థలు. ఇవి తప్పనిసరిగా ఉండాలి. ఇవిలేని పక్షంలో ఆ ప్రాంతం నుండి ఎంత గొప్ప సాహిత్యం వచ్చినా అది ఏ ప్రాంతానికి తెలియకుండా మరుగున పడిపోతుంది. ప్రపంచంలో క్రీ.శ. 1041 చైనాలో బిషెంగ్ అనే వ్యక్తి మొదటి ముద్రణానిలయాన్ని స్థాపిస్తే, 1377 కొరియాలో డైనార్టీ స్థాపించిన ముద్రణా సంస్థ రెండవదని చారిత్రక ఆధారాలవల్ల తెలుస్తుంది. ఈ రెండింటి తర్వాత గూటన్‌బర్గ్ 1456 జర్మనీలో ముద్రణా సంస్థను నెలకొల్పాడు. పై రెండు ముద్రణా నిలయాల్లో పుస్తకాలను ముద్రించినట్లు ఆధారాలు అభించడం లేదు. అయితే గూటన్‌బర్గ్ మాత్రం తన ముద్రణా నిలయంలో 1459లో 'బైబిల్'ను ముద్రించినట్లు తెలుస్తుంది. బర్గ్ అచ్చుయంత్రాన్ని ఆధారంగా చేసుకొని భారతదేశంలో మొదటిసారి కేరళలో 1556న ముద్రణా నిలయం స్థాపించబడింది. ఈ ముద్రణా నిలయం సమాజానికి అంతగా పరిచయం కాలేక పోయింది. తర్వాత వారన్ హేస్టింగ్ పాలనాకాలంలో కంపెనీ ప్రభుత్వం తరపున

ఆగస్టన్ హిక్కీ ఆధ్వర్యంలో న్యూస్ పేపర్ ముద్రణ బెంగాలులో కొనసాగింది. తర్వాత గంగాకషార్ భట్టాచార్య సెరంపూర్‌లో (కలకత్తా) ముద్రణా సంస్థలు నెలకొల్పి సాహిత్య గ్రంథాల ముద్రణకు పూనుకొన్నాడు. బెంగాల్‌ను ఆదర్శంగా తీసుకొన్న తెలుగు ప్రాంతం ముద్రణా నిలయాల స్థాపనకు పూనుకొన్నది. మహారాష్ట్ర నుండి మాతృభూమికి (ఆంధ్ర ప్రాంతం) వచ్చిన కొమర్రాజు వెంకటలక్ష్మణరావు 1906లో "విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి"ని మునగాలలో రాజా వెంకటరంగారావు బహద్దూర్ సహాయంతో స్థాపించారు. ఈ గ్రంథమాల అటకల మీద బూజుపట్టి చెదలంటిన తెలుగు ప్రాచీన సాహిత్యాన్ని గ్రంథస్తం చేయడంలో అపారమైన సేవను అందించింది. కాలానుగుణంగా మారుతున్న సమాజంలోకి చొచ్చుకొని వస్తున్న ఆధునిక సాహిత్య ప్రక్రియల్ని ముద్రించి తెలుగులో ప్రాచీన, ఆధునిక సాహిత్యాల్ని ప్రజల దగ్గరికి చేర్చింది. కోస్తా ప్రాంతంలో ఆధునిక సాహిత్య ప్రక్రియలు వెలుగులోకి రావడానికి ఈ సంస్థ మొదటి మెట్టు. ఈ సంస్థ వెలువడడానికి ముందు కోస్తా ప్రాంతంలో పత్రికలే గానీ గ్రంథ ముద్రణా సంస్థలు లేవు అని చెప్పవచ్చు. తెలంగాణా వైతాళికులు రావి చెట్టు రంగారావు, శ్రీ లక్ష్మీపతి, మాడపాటి హనుమంతరావు మొదలైన వారంతా లక్ష్మణరావుతో కలిసి విజ్ఞాన చంద్రిక గ్రంథమాలను హైదరాబాదుకు చేర్చారు. చివరకు ఈ గ్రంథమాల హైదరాబాదు నుండి మద్రాసుకు చేరి అక్కడ స్థిర నివాసం ఏర్పరుచుకొంది. దీనితో ఈ గ్రంథమాలను కోస్తా, తెలంగాణా ప్రాంతంలో మొదటి గ్రంథమాలగా చెప్పవచ్చు.

*తెలంగాణా వైతాళికులు రావి చెట్టు రంగారావు, శ్రీ లక్ష్మీపతి, మాడపాటి హనుమంతరావు మొదలైన వారంతా లక్ష్మణరావుతో కలిసి విజ్ఞాన చంద్రిక గ్రంథమాలను హైదరాబాదుకు చేర్చారు. చివరకు ఈ గ్రంథమాల హైదరాబాదు నుండి మద్రాసుకు చేరి అక్కడ స్థిర నివాసం ఏర్పరుచుకొంది. దీనితో ఈ గ్రంథమాలను కోస్తా, తెలంగాణా ప్రాంతంలో మొదటి గ్రంథమాలగా చెప్పవచ్చు.*

ఈ గ్రంథమాల ఏర్పడక ముందు కోస్తా, తెలంగాణా, రాయలసీమ ప్రాంతంవాళ్ళు తమ సాహిత్య గ్రంథాలను ముద్రించడానికి 'మద్రాస్ ముద్రణా సంస్థల మీద ఆధారపడేవాళ్ళు. వేంకట లక్ష్మణరావు అంకురార్పణం చేసిన 'విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి'ని చూచి కోస్తా ప్రాంతంలో తొలితరం ముద్రణా సంస్థలు విరివిగా వచ్చాయి. వాటిలో ఆంధ్ర ప్రచారిణీ గ్రంథ నిలయం (1911), వేగుచుక్క గ్రంథమాల (12-12-1911), ఆంధ్రభాషాభివర్ధినీ లిమిటెడ్ (911), సరస్వతీ గ్రంథమండలి మొదలైన ముద్రణా సంస్థలు తొలితరంలో కోస్తా ఆధునిక సాహిత్యానికి నీరాజనాలు అందించాయి. ఈగ్రంథ నిలయాలవల్ల తెలుగు దేశంలో తెలుగు సాహిత్యానికి ఒక నూతన శకం మొదలయిందని చెప్పవచ్చు. నిత్యం ప్రవహించే జలాశయాలు, బంగారం పండేపచ్చని సారవంతమైన భూములు కలిగిన కోస్తా ప్రాంతం ఆధునికతను సంతరించుకొని సంస్కరణ భావంతో ముందుకు నడిచింది. ఇతర ప్రాంతాల కంటే కోస్తా ప్రాంతం అన్ని విధాలా అభివృద్ధికి నోచుకొందనే చెప్పాలి. గోల్కొండ సంస్థానం పతనం తర్వాత హైదరాబాదు బాగా అభివృద్ధి చెందింది. తెలంగాణా ప్రాంతానికే కల్పతరువులా మారింది. ఈ రెండు ప్రాంతాలలో 1900-1910 మధ్య ముద్రణా సంస్థలు వుండడం వల్ల ఆ ప్రాంతాలలో ఆధునిక సాహిత్యం వికాసదశ వైపు ప్రయాణం చేసింది. ఈ నేపథ్యంలో ముందుగా కోస్తా ప్రాంతం తర్వాత తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలు ఆధునిక సాహిత్యానికి పెద్దపీట వేశాయి.

రాయలసీమ ముద్రణా సంస్థలు ఎప్పుడు మొదలయ్యాయి అనడానికి ఎటువంటి ఆధారాలు లేవు. అయితే కొమర్రాజు గారి గ్రంథమాల కంటే దాదాపు చాలాకాలం క్రితం రాయలసీమలో ముద్రణా సంస్థలు ఉన్నట్లు తెలుస్తుంది. బళ్ళారిలో 1815లోనే ముద్రణా నిలయం ఉన్నట్లు 'స్వతంత్ర భారత స్వర్ణోత్సవ సావనీర్' తెలియజేసింది. "బళ్ళారి జిల్లా గెజిట్ ప్రకారం మొదటి ప్రింటింగ్ ప్రెస్ బళ్ళారిలో 1815లో స్థాపించబడింది. మిస్టర్ పైనీ పర్యవేక్షణలో లండన్ మిషనరీ సొసైటీ దీన్ని స్థాపించింది. 19వ శతాబ్దం మొదటి భాగంలోఈ ప్రెస్సు మొదటిసారిగా అమరకోశాన్ని, కన్నడంలో బైబిల్‌ను ప్రచురించింది (స్వతంత్ర భారత స్వర్ణోత్సవ సావనీర్ పు. 37) ఈ గ్రంథమాల కొనసాగలేదు. తర్వాత 1891న కడపలో 'కళ్యాణ కుమార విలాస ముద్రణా నిలయం' ఉన్నట్లు "శ్రీమహాభారతము - ఆదిపర్వం" అనే గ్రంథం ద్వారా తెలుస్తుంది. దీని రచయిత కృష్ణం సూరయ్యశ్రేష్ఠి. ఇది సంస్కృత భారతానికి టీకాతాత్పర్యంగా రచించిన గ్రంథం

ఈ గ్రంథమాల సంపాదకులు ఎవరో తెలియడంలేదు. ఈ గ్రంథమాలలో అచ్చయిన 'శ్రీమహాభారతము - ఆదిపర్వము' గ్రంథంలోని లోపలి పుటలు చాలా శిథిలం కాగా మిగిలిన పుటలతో ఉన్న ముఖచిత్రం మాత్రం ప్రస్తుతం సి.పి. బ్రౌన్ గ్రంథాలయంలో దొరుకుతుంది. 'కళ్యాణకుమార గ్రంథమాల', 'విజ్ఞాన చంద్రికా గ్రంథమా'ల కంటే ముందే ప్రారంభం అయినా రాయలసీమలో దీని కొనసాగింపు కూడా అంతగా కనిపించలేదు. అయితే ఈ గ్రంథమాలలు, కేవలం ప్రాచీన సాహిత్య గ్రంథాలకు అద్దం పట్టినట్లు కనిపిస్తున్నాయి. **1890కి ముందే ఏర్పడిన 'కళ్యాణకుమార విలాస ముద్రణా నిలయం' తొలి తెలుగు ముద్రణా సంస్థ అని లభించిన ఆధారాల వల్ల వెల్లడవుతుంది.** ఈ ఆధారంతో తెలుగు ప్రాంతంలో నవల, విమర్శలతో పాటు ముద్రణా నిలయం కూడా రాయలసీమలోనే పురుడు పోసుకొన్నది. దీని తర్వాత సీమలో రమారమి 32 సంవత్సరాల వరకూ గ్రంథమాలల జాడ లేదు. దీనితో 1891-1920 మధ్య రాయలసీమలో వచ్చిన విలువైన ఆధునిక రచనలు ఏవీ ముద్రణకు నోచుకోక తెలుగు సాహిత్య విమర్శకు అందకుండా చెదలు బారిన పడి కనుమరుగయ్యాయి. శ్రమకోర్చి ముద్రణ కోసం ఇతర ప్రాంతాలకు వెళ్లిన గ్రంథాలు అక్కడే శిథిలం అయిపోయాయి.

*ముద్రణా నిలయం కూడా రాయలసీమలోనే పురుడు పోసుకొన్నది. దీని తర్వాత సీమలో రమారమి 32 సంవత్సరాల వరకూ గ్రంథమాలల జాడ లేదు. దీనితో 1891-1920 మధ్య రాయలసీమలో వచ్చిన విలువైన ఆధునిక రచనలు ఏవీ ముద్రణకు నోచుకోక తెలుగు సాహిత్య విమర్శకు అందకుండా చెదలు బారిన పడి కనుమరుగయ్యాయి.*

1923 కడప జిల్లా చాగలమర్రి లో 'బాలభారతీ గ్రంథనిలయం' ఏర్పడింది. ఈ 32 సంవత్సరాల కాలంలో (1891-1923) ముద్రణా నిలయాల కొనసాగింపు వున్నింటే సీమ ఆధునిక సాహిత్యం వెనుకబడి వుంది అనే వాదనలకు దూరంగా వుండేది. అంతేగాక ఆధునిక సాహిత్యంలో సీమ సాహిత్యం అన్ని విధాల ముందుండడానికీ అవకాశం వుండేది. బాలభారతీ గ్రంథనిలయం వ్యవస్థాపకుడు మదల్లపల్లి రామసుబ్బయ్య శ్రేష్ఠి, సంఘ సంస్కర్తే గాకుండా స్వాతంత్ర్య సమరయోధుడు కూడా. గాంధీగారు చాగలమర్రిని సందర్శించినపుడు వారికి విశ్రాంత నివాసాన్ని ఏర్పరచిన వ్యక్తి మదల్లపల్లి రామసుబ్బయ్య శ్రేష్ఠి. బాలభారతీ గ్రంథమాలకు సంపాదకుడు 'రేనాటి వీరుడు' నవలా కర్త అయిన కల్వటాల జయరామారావు. వీరిద్దరి ఆధ్వర్యంలో గ్రంథమాల 1923 నుండి 1925 వరకూ (3 సంవత్సరాలు) కొనసాగింది. ఈ గ్రంథమాలలో ముద్రించిన మొదటి పుస్తకం కల్వటాల జయరామారావు రచించిన మొదటి నవల సువర్ణకేసరి కృష్ణసేన" అనే నవల. ఈ నవల తర్వాత రామసుబ్బయ్య శ్రేష్ఠికి, కల్వటాల వారికి మధ్య ఏర్పడిన కొన్ని మనస్పర్థల వల్ల ఈ గ్రంథమాల మూతపడింది. ఈ విషయాన్ని పాలపర్తి సూర్యనారాయణ తన 'ప్రియదర్శిని' అనే చారిత్రక నవలలో ఇలా పేర్కొన్నారు. "ఇరువురు కలిసి యొక మహాకార్యమును వహించి నిష్కారణంగా మనస్పర్థల గలగించుకొనుట గాక విపరీత ప్రసంగముల కార్యముల నాచరించుట విద్యావంతుల యొక్క లక్షణము కాదని చెప్పుటకు సావానించినందులకుం మన్నింతురుగాక. ఎన్నో భేదాభిప్రాయాలున్ననూ ఏదో యొక విధముగా సరివుచ్చుకొని ప్రారంభించిన పని విడువక యుత్తమ మార్గము జనుటయేలగుగాని నేడు ప్రారంభించిన దానిని నాదియందే వదిలేసి వేరుకార్యమొనర్ప బ్రయత్నించుట వలన కార్యసఫలత నొందజాలము. ఇప్పటికైనను వారు (జయరామారావు) విద్యావంతులు గావున బేధాభిప్రాయమును వీడి తాము ప్రారంభించిన మహత్కార్యమును తృప్తదశకు గానిరా ప్రయత్నింతురని నమ్ముచున్నాను." ఈ మాటల వల్ల జయరామారావు, రామసుబ్బయ్య శ్రేష్ఠితో పేచీ పడినట్లు తెలుస్తుంది. అంతేగాక జయరామారావు తొలి రచన అయిన 'సువర్ణ కేసరీ కృష్ణసేన' (1923) నవలను బాలభారతి గ్రంథమాలలో ముద్రించి తర్వాత 1925లో రచించిన రేనాటి వీరుడు నవలను మాత్రం బెజవాడలోని వాణీముద్రాక్షరశాలలో ముద్రింపచేశారు. కల్వటాల వారి సహాయసహకారాలు కోల్పోయిన తర్వాత రామసుబ్బయ్య శ్రేష్ఠి బాలభారతీ గ్రంథమాలను నిలిపివేశారు. 'కళ్యాణ కుమార విలాస గ్రంథమాల' తర్వాత 32 సంవత్సరాలకు ఏర్పడిన ఈ గ్రంథమాల కూడా కేవలం 2 సంవత్సరాలే నిలిచింది. బాలభారతీ గ్రంథమాల నడిచిన ఈ కొద్ది కాలంలోనే సువర్ణకేసరీ కృష్ణసేన (నవల), కలియుగ దర్పణం (నాటకం), మేవాడు పతనం, గండికోట,

మనోరంజని (నాటకం) ప్రియదర్శిని (నవల), రత్నాబాయి (నవల) మొదలైన గ్రంథాలను ముద్రించింది. ఈ కొద్ది రచనల ద్వారా 1923 నాటికే సీమ ఆధునిక సాహిత్య రచనల కొనసాగింపు వుందని అర్థమౌతుంది. ఈ గ్రంథమాలను మూసిన తర్వాత రామసుబ్బయ్య శ్రేష్ఠి ప్రొద్దుటూరుకు చేరి 1926 నుండి 'భారత కథానిధి" అనే మాసపత్రికను నడిపారు. ఈ పత్రికవల్ల శ్రేష్ఠి సీమ కథా రచయితలకు మంచి ప్రోత్సాహాన్ని కలిగించాడు. ఈ భారతకథానిధి వల్ల 1926 నుండే సమకాలీన ఆధునిక వస్తువులతో కూడిన కథలు సీమలో వెలువడుతూ ఉండేవని మనం భావించవచ్చు. ప్రస్తుతం ఈ భారత కథానిధి సీమ కథా పరిశోధనలకు ఒక స్ఫూర్తిని అందించింది. 1926లో వచ్చిన భారత కథానిధిలో దాదాపు వందకు పైగా వచ్చిన సీమ కథలను పరిశీలిస్తే, సీమలో కథా ప్రారంభం గురజాడ 'దిద్దుబాటు' కథాకాలానికి ఏమాత్రం తక్కువ కాకుండా వచ్చి ఉండవచ్చనే అభిప్రాయం కలుగుతుంది. దీనికి సూచికగా ఇటీవల వివినమూర్తి సంపాదకత్వంలో వచ్చిన 'దిద్దుబాటులు' అనే గ్రంథంలో దిద్దుబాటుకు ముందే సీమ నుంచి రెండు మూడు కథలు ఉన్నట్లు తెలుస్తుంది. పై రెండు విషయాలు సీమ కథాసాహిత్యంపై మరింత లోతైన పరిశోధన జరగాల్సిన అవసరం ఉందని తెలియజేస్తున్నాయి. రామసుబ్బయ్య శ్రేష్ఠి 'బాలభారతి గ్రంథమాల'తో సీమ నవలకు, 'భారత కథానిధి'తో సీమ కథకూ ప్రాణం పోశారు. ఈయన కృషి సీమ సాహిత్య చరిత్రలోనే అభినందనీయమనే చెప్పాలి. ప్రస్తుతం చాగలమర్రిలో 'బాలభారతీ గ్రంథనిలయం ఉన్నచోట క్రైస్తవ సహాయవైద్యశాల ఉంది. అక్కడే బాలభారతి గ్రంథ నిలయానికి చెందిన శిలాఫలకం కూడా ఉంది. 1923 బాలభారత గ్రంథనిలయం మూతపడిన ఏడు సంవత్సరాలకు అంటే 1930లో కల్లూరి అహోబిళరావు బళ్ళారిలో శ్రీకృష్ణదేవరాయ గ్రంథ నిలయంను స్థాపించారు. ఈ గ్రంథ నిలయానికి ఘూళీ కృష్ణమూర్తి, హెచ్. దేవదానము, నాగసముద్రం వాసుదేవరావు, రాళ్ళపల్లి వంటి ప్రముఖ సీమ రచయితలు వారి సహాయ సహకారాలు అందించారు. ఈ గ్రంథమాలలో ఏర్పడిన తొలి పుస్తకం ఘూళీ కృష్ణమూర్తి రచించిన 'స్వార్థత్యాగము' నవల. కల్లూరి అహోబిళరావు రచించిన 'రాయలసీమ రచయితల చరిత్ర' అనే గ్రంథం కూడా ఈ గ్రంథమాలలోనే ముద్రించబడింది.

> ***1926లో వచ్చిన భారత కథానిధిలో దాదాపు వందకు పైగా వచ్చిన సీమ కథలను పరిశీలిస్తే, సీమలో కథా ప్రారంభం గురజాడ 'దిద్దుబాటు' కథాకాలానికి ఏమాత్రం తక్కువ కాకుండా వచ్చి ఉండవచ్చనే అభిప్రాయం కలుగుతుంది.***

ఈ గ్రంథమాల స్ఫూర్తితో రాయలసీమలో మిగిలిన జిల్లాలలో ముద్రణా సంస్థలు విరివిగా వచ్చాయి. అందువల్లనే 1930 నుండి 1940 వరకు వచ్చిన సీమ ఆధునిక సాహిత్య రచనలు రాయలసీమలోనే ముద్రింపబడి తెలుగు సాహిత్యంలో పాలుపంచుకొన్నాయి. అందువల్ల రాయలసీమలో 1940 తర్వాత ఆధునిక ప్రక్రియలు మొదలయ్యాయనీ, స్వాతంత్ర్యోద్యమం తర్వాతనే సీమ ఆధునిక సాహిత్యం అద్భుతంగా కొనసాగిందనే వాదనలు నేడు వినిపిస్తున్నాయి.

నిన్నటి వరకు రాయలసీమలో ఆధునిక సాహిత్యం ఆలస్యంగా వెలువడింది అని చెప్పడానికి ఒకవైపు అవధానం, పద్యకవిత్వం కారణాలైతే మరోవైపు గ్రంథ ముద్రణానిలయాలు పుష్కలంగా లేకపోవడం మరొక కారణం. అయితే రాయలసీమలో తొలితరంలోని ఆధునిక రచయితలు వారి రచనలైన నవల, కథ, విమర్శలాంటి ఆధునిక ప్రక్రియల్ని మిగిలిన ప్రాంతాలతో పాటు తొలి నుండి కొనసాగింపు చేశారు. కానీ అవి రాయలసీమలో ముద్రణ కాలేదు. రాజమండ్రి, విజయవాడ, మద్రాసు, విశాఖపట్నం లాంటి ప్రాంతాలలోని గ్రంథముద్రణా నిలయాలలో ముద్రణకు నోచుకొన్నాయి. ఈ ప్రాంతాలలో ముద్రితమయిన ఆధునిక రచనలు తిరిగి రాయలసీమకు చేరలేదు. చేర్చే ప్రయత్నమూ జరగలేదు. అక్కడే ఉన్న సీమ ఆధునిక రచనలైన నవల, కథల లాంటి ప్రక్రియల్ని ఆదరించే నాథుడు లేక అనాథలాగా కాలగర్భంలో కలిసిపోయాయి. మరికొంత మంది రచయితలు రచించిన ఆధునిక ప్రక్రియలు ముద్రణకు నోచుకోక ఇంటి అటవలపైన చెదలు పట్టి కనుమరుగయ్యాయి. 1930 తర్వాత రాయలసీమలో ఏర్పడిన ముద్రణా నిలయాలలో ముద్రితమయిన అతి స్వల్ప సాహిత్యం ప్రస్తుతం సీమసాహిత్యానికి నూతన విషయాలుగా సంతరించుకుంటున్నాయి. అచేతనంలో ఉన్న నేలను తట్టి చైతన్య పరిచిన చినుకులా సీమ ఆధునిక సాహిత్యంపై చేయాల్సిన కృషిని గుర్తుచేస్తున్నాయి. 

# వెన్నుపాము

యాములపల్లి నరసిరెడ్డి
9603759059

తనవంతు సాయమది
పనిమంతుల లక్షణమది
చీమకరచి చంపేంతటి చిన్నప్రాణం
కోడి నోటకరుచుకుపోయేంత అల్పజీవితం
కాళ్లున్నాయా... చేతులున్నాయా
కళ్ళున్నాయా.... కోరికలున్నాయా
ఉన్నదొకటే పని తినడం తయారు చేయడం
ఒంటేలు పోసుకున్నంత తేమ ఉంటే చాలు
విశ్రాంతి తీసుకునే రకం కానేకాదు
చినుకుల్లోంచి పడుతుందో
భూమి పొరల్లోంచి పుడుతుందో
శాయశక్తులా దాని కృషి శ్లాఘనీయం
విద్యుత్తు తీగలా ఉంది విద్యుక్త ధర్మం
నిర్వర్తిస్తూంటుంది
ఎపుడు పుడుతుందో ఎపుడు పరమవదిస్తుందో
వెన్నలా మెత్తగున్నా మన్నుపొరల్లోని కుళ్లును
మృష్టాన్నంగా తిని
సేంద్రియ ఎరువుల సత్తువను దిగుబడిగా
చూపింది
ఎక్కడా ధిక్కార స్వరం లేదు ఆజ్ఞల ఉల్లంఘనాలేదు
ఎవరు నష్టపోయిందీ లేదు మరెవర్ని నిలువరించిందీ లేదు
వ్యర్థాలను తిన్నది నికార్సైన ఎరువును
మొక్కల వేళ్ళకందించింది
నిజానికి రైతుమిత్ర పురస్కారం ముందు దానికే దక్కాలి
ఎందుకంటే, ఏదీవ్యర్థం కాదని అంతా పరమార్థమేనని
నిరూపించింది
ఎండకు తాళలేక భూమిపైకి రాదుగానీ....
లేకుంటే.... మనుషుల్లోని కుళ్లును
కూకటివేళ్లతో సహా తినేసి
మానవత్వాన్ని మరింత మెరిపించేదే.....!
వానపాము, హరిత ఉద్యమానికి ఎప్పటినుంచో వెన్నుపాము !!



# ఒక నిర్మాణపు కదలిక కోసం

సప్రం గణేష్‌బాబు
8977348821

మెలుకువ అలికిడికి కలలన్నీ అర్థంకాని
అయోమయంలో మూకుమ్మడిగా తనువు చాలిస్తాయి
విచక్షణ లేని కోపం
వివేకం లేని మాట
దారి తెన్నూలేని ప్రయాణం
గాలివాటు మేఘం వెనక్కు తప్పిపోతాయి
జీవితాన్ని వెంట బెట్టుకొని ఆకుమీద పడ్డ చినుకు
దాని తడిని మోయలేక వోడిపోతుంది
అర్థవంతంకాని నిర్ణయాల్లో నువ్వు నేను కాలాన్ని వృధా చేస్తే
మూడుకాళ్ళ ముసలితనం భుజాలెక్కుతుంది
అనివార్యమైన శాసనాలు మన నెత్తిమీద కుమ్మరించినట్టు
భక్తితో భయంతో మోకాళ్ళమీద మోకరిల్లి
కాలాన్ని జీవితాన్ని తిట్టుకుంటూ
మూఢంగా మూర్ఖంగా నుదిటిరాతగా అనుకుంటే
ఆవిష్కరణలు ఆలోచనలు
వయస్సు అయిపోయిన ముసలితనంతో
మంచాన్ని ఆశ్రయించేయి
ఈలోకమంతా నమ్మకం భరోసా నడుపుతుంది
చెమట చిందిన నేలమీద విత్తనాలు మొలకెత్తుతాయి
నెత్తురు రగిలినచోట ఆకాశం తలొంచి సలాం చేస్తుంది
చరిత్ర కాన్వస్‌మీద రేపటి భవిష్యత్తుని
పడుగు పేకలా మిళితం చేసి నేసేది మనమే
అయినప్పుడు
అంగవైకల్యం ఎందుకు? అర్థంకాని అజ్ఞానం ఎందుకు?
ప్రశ్నలున్నది జవాబులు వెతకడానికే
చీకటున్నది వెలుగు ముద్దలతో నింపడానికే
చేతులున్నది చెంపమీద కన్నీళ్లు తుడుచుకోడానికే కాదు
తుడవడానికే కూడా



కథ

# నేల తల్లి

- కర్లపాలెం నిరంజన్
7702496616



డగ్... డగ్.. డగ్.... మంటు దూరంగా కారు వస్తున్న శబ్దం. కారు వెంట పడే పిల్లల అరుపులు, కేరింతలు, ఈలలు.

"చస్... వీళ్ళ కడుపులు మాడ. ఊళ్లోకి మోటారు బండి వచ్చింది అంటే చాలు.. ఈ పిల్ల నా.. నెమ్మదిగా ఉండరు కదా! కోతి వచ్చినప్పుడు కాకులు గొడవ చేసినట్టు ఈ పిల్ల పిశాచాలు గోల తట్టుకోలేక పోతున్నాము." మంచం మీద నుండి బద్ధకంగా వళ్ళు విరుచుకుంటూ లేచాడు రంగయ్య.

పెద్ద గంజాం. జాతీయ రహదారికి కేవలం ఇదు కిలోమీటర్లే. కాని ఆ ఊరు వెళ్ళాలంటే రెండే రెండు దారులు. గుంటలు మెట్టలు వున్న రోడ్డు పై ఏ ఎద్దుల బండిలోనో లేక నడిచో వెళ్ళాలి. లేదా రైల్లో పక్క స్టేషన్లో దిగి ఊరికి మధ్య పారుతున్న కృష్ణమ్మ పాయమీదుగా పిన్నీసు (చిన్న పడవ) లో ఎక్కి ఆ ఊరు చేరాలి.

రాను రాను కారు శబ్దం దగ్గరగా వినిపిస్తున్నది.

"ఈ రాష్ట్రం ఇడివడటం కాదు కాని, మా పానం మీదకి వచ్చింది. పతొక్కడు రావటం నీ రోడ్డెంబటి ఉన్న పొలం మాకమ్మితే లచ్చలు ఇత్తామంటూ ఇల్లంబటి కుక్కలు తిరిగినట్టు తిరుగుతున్నారు. మా లచ్చనంగా రెండు పంటలు పండే భూమిని అమ్మేయమంటున్నారు. అమ్మను పోవయ్యా అంటే రింగు రోడ్డు వస్తది, అయి వే వస్తది అప్పుడు గవుర్నమెంటే మా భూములు లాక్కుంటదని ఒకటే మీన భయపెడుతున్నారు. నయానో బయానో మా భూముల్ని కా చేయాలని చూస్తున్నారు ఈ పున్డాకోరులు. ఇయాల ఎవడి భూములకి ఎసరు పెట్టారో ?" మనసులో అనుకున్నాడు రంగయ్య.

మోటారుకారు శబ్దం మరీ దగ్గరగా వినిపించింది.

"ఈ సారి ఎవరికి మూడిందో. తర తరాలు కష్టపడి ఇప్పుడు వీళ్ళకి వొప్పచెప్పాల్సి వస్తుంది, వాళ్ళ నేల తల్లిని." అనుకున్నాడు రంగయ్య.

కారు తన సందులోకే రావటంతో రంగయ్య గుండెలు గుభేల్ మన్నాయి. పై పెచ్చు కారు తన ఇంటి ముందుకు వచ్చి ఆగుతుండటంతో వొకవైపు భయం, ఇంకోవైపు కంగారు.. ఏమి చేయాలో పాలుపోని తనం.

"సమయానికి ఈ నాగన్న ఏడ సచ్చాడో." అనుకుంటూ భయంగా కారు వంక చూడ సాగాడు.

నాగరాజు రంగయ్య కొడుకు. తెలివి కలవాడు. డిగ్రీ చేతపట్టి ఎవరెన్ని చెప్పినా ఉద్యోగం కోసం చూడకుండా, తన పొలంలోనే పని చేసుకుంటున్నాడు. అప్పటినుండి పొలం

పనులన్నీ నాగారాజుకి వప్పచెప్పి, తను పై పై పనులు చేస్తూ కాలక్షేపం చేస్తున్నాడు రంగయ్య.

కారులో నుండి ముగ్గురు పెద్ద మనుషులు దిగారు. సూటు, బూటు వేసుకుని చూడటానికి పెద్ద ఉద్యోగాలు చేసే వాళ్ళలాగా ఉన్నారు. పెద్ద పెద్ద అంగాలు వేస్తూ రంగయ్య వైపుకు వస్తున్నారు.



రంగయ్య గుండె గొంతులోకి వస్తున్నట్లుంది. చిరు చెమటలు పట్టటం మొదలు పెట్టాయి. నరాలన్నీ లాగుతున్నట్లున్నాయి. మనిషి మొత్తాన్ని నిసత్తువ ఆవహించినట్లుంది.

ఆ పెద్ద మనుషులు నేరుగా రంగయ్య దగ్గరకి వచ్చి "మీరేనా రంగయ్య అంటే" అంటూ సంభాషణ మొదలు పెట్టారు.

"అవును బాబయ్య, తమరు..." అంటూ వారి వంక చూసాడు.

"మా సంగతి తరవాత చెప్తాము. ముందు ఈ విషయం చెప్పండి. జాతీయ రహదారి పక్కన ఉన్న పది ఎకరాల భూమి మీదేనా?"

"అవును బాబయ్య. మా తాతల నాటి సంపాదన. వారసత్వంగా వచ్చిన నేలమ్మ. ఇంతకీ ఆ విషయం ఎందుకు బాబయ్య?"

"ఆ భూమికి సంబంధించిన కాగితాలన్నీ మీ దగ్గర ఉన్నాయా?"

"అయ్యో... లేకపోవటమేమిటి బాబయ్య. పట్టాదారు పాసు పుత్తకం తో సహా అన్నీ పక్కాగా ఉన్నాయి."

"అయితే అసలు వ్యవహారానికి వద్దాం. ఈ రాష్ట్రం విడిపోయిన తరువాత, మన రాష్ట్ర అభివృద్ధి కోసం మన రాష్ట్ర ప్రభుత్వం కొత్త కంపెనీలు పెట్టటానికి అనుమతులు, రాయతీలు ఇస్తున్నది. దానిలో భాగంగా మా కంపెనీకి ఒంగోలు దగ్గరలో ఒక యాభై ఎకరాల భూమిని కేటాయించింది. త్వరలో మా కంపెనీ ని మొదలు పెట్టపోతున్నాము. దానిలో భాగంగానే మీ దగ్గరకి వచ్చాము."

"ఏ కంపెనీ బాబయ్య?"

"నీకు తెలిసే ఉంటుంది. ఈ మధ్య ఉర్లగడ్డ చిప్స్ పాకెట్లో పోసి అమ్ముతున్నారు కదా! అటువంటిదే మేము ఒక కంపెనీ పెట్ట పోతున్నాము."

"అట్టానా... అయితే మాతో మీకేం పని బాబయ్య.. చెప్పనే లేదు."

"చెప్తాం కానీ, ఇంతకీ నీ పది ఎకరాల భూమి మీద యెంత ఆదాయం వస్తుంది."

"ఆ... యెంత బాబయ్య.. ఖరుచులు పోను ఏటా ఓ లచ్చ రూపాయలు మిగులుతాయి. 'కొనబోతే కొరివి అమ్మబోతే అడవి' అన్నట్టు ఉన్నది మా పరిస్థితి. ఎరువులు రేట్లు రెట్టిమ్పాయ, విత్తనాలు దొరకవాయ, అతివృష్టి, అనావృష్టి తో ఎప్పుడు పంట చేతికోస్తుందో, ఎప్పుడు నాశనమవుతుందో తెలియకుండా ఉన్నది. పంట చేతికొచ్చినా అమ్మటానికి పొతే గిట్టుబాటు ధరలు లేక, చలవ గిడ్డంగులకు అద్దెలు కట్టలేక యమ కష్టంగా ఉన్నదంటే నమ్మండి బాబయ్యా."

"అయితే మేము చెప్పేది జాగ్రత్తగా విను పెద్దాయన. మేము మీలాంటి పెద్ద రైతుల కోసం ఒక పథకం చెబుదామని వచ్చాం. మీకున్న భూమికి, మీకొచ్చే ఆదాయానికి అసలు పొంతన ఉండటంలేదు. అందుకని ఎకరాకి ఇరవై వేలు అంటే మీ దగ్గర ఉన్న భూమికి సంవత్సరానికి రెండు లక్షలు వచ్చే మార్గం చెబుదామని వచ్చాము. అంటే మీ సంపాదనకి రెండు రెట్లన్నమాట."

రంగయ్య కొంచం స్థిమిత పడ్డాడు. 'ఈళ్ళు నా భూమిని లాక్కోవటానికి రాలేదు. పైగా నా ఆదాయం పెరిగే మారగం చెబుతామంటున్నారు.'

"చెప్పండి బాబయ్య... ఇంతగా నాకు ఆదాయం పెరుగుతుందంటే అంతకన్నా సంతోసం ఏముంటది."

"అయితే విను పెద్దాయన. మీ పొలం మాకు అయిదు సంవత్సరాలకి కిరాయకి ఇవ్వాలి. ఇచ్చినట్లు కాయతం రాసిస్తే చాలు. ఎరువులు, పురుగు మందులు, విత్తనాలు అన్నీ మేమే ఇస్తాము. నాట్లకి, కోతల కి అయ్యే ఖర్చులు మేమే భరిస్తాము. మీరు చేయ వలసిందల్లా దగ్గరుండి పని చేయించడము. వచ్చిన పంటను వచ్చినట్లు మా గోదాముకి చేర్చడం. అయితే మేము చెప్పిన పంటే వేయాలి. మేము చెప్పిన విత్తనాలు, పురుగు మందులు వాడాలి. అర్థమయిందా?"

"అరదమయింది... కానీ బాబయ్యా.. నాకో చిన్న సందేహం. మీరా వర్లగడ్డ చిపుసు వ్యాపారం అంటున్నారు. మా ప్రాంతంలో ఎక్కాడా వర్లగడ్డ పంట వేయటం నేనెరగ. పండని పంటకి ఎందుకంత ఖరుచు పెడుతున్నారో నాకరదం కావటంలా?" సందేహం వెలుబుచ్చాడు రంగయ్య.

"లాభ నష్టాల సంగతి మాకొదిలేయండి. మేము చెప్పిన

దానికి సరేనంటే ఎగ్రిమెంటు చేసుకుందాము. మీ డబ్బులు మాత్రం ముద్రసరిగా ఏడాదికి ముందరే అప్పచెబుతాము. మరి కాయితాలు రాసుకుందామా?"

"కొంచం నన్ను ఆలోచించుకోనీయండి బాబయ్యా. అదీ కాక మా పెద్దోడు, చదువుకున్నోడు. వాడితో కూడా కొంచం సంపరదించిన తర్వాత కాని నేను ఏ విషయం చెప్పలేను."



"సరే అట్లాగే కానీ. ఇదిగో మా కార్డు. మీ నిర్ణయం చెబితే మనం కాయతాలు రాసుకోవచ్చు. పైగా మీ అబ్బాయ్ చదువుకున్నాడంటున్నావు, మా కంపెనీలోనే అతనికి ఏదయినా ఉద్యోగం ఇప్పిద్దాం. ఇంత మంచి అవకాశం మళ్ళీ రాదు. వస్తాం మరి. ఏ సంగతీ త్వరగా చెప్పు." అంటూ ఆ పెద్ద మనుషులు తమ విజిటింగ్ కార్డు రంగయ్య కిచ్చి వెనుదిరిగారు.

" " "

"…. అదిరా పెద్దోడా ఇసయం. ఆరుకాలం కష్టపడ్డా చేతిలో చిల్లి కాని మిగలటం లేదు. ఈ ఐదేళ్లలో మన కష్టాలు కొంచం గట్టెక్కుతాయను కుంటున్నాను, ఏమంటావు?" రంగయ్య తన పెద్ద కొడుకుతో విషయం అంతా వివరంగా చెప్పాడు.

"అంటే వాళ్లకి కిరాయికి ఇచ్చేద్దామంటావు. కాని భవిష్యత్తులో మన నేలమ్మ గురించి ఆలోచించావా అయ్యా?" ప్రశ్నించాడు నాగ రాజు.

"అందుకే కదరా నిన్ను అడిగి ఏ విషయం చెబుతానన్నాను. నువ్వు ఎవసాయం గురించి చదూకున్నోడివి. పట్నం లో సదూకొన్నాడివి. నీకు సదువుతో పాటు లోకగ్నానం ఉంటుందనే కదా నీతో ఇసయాలన్నీ చెప్పుకొచ్చింది. …. అయితే ఇలా కిరాయకి ఇవ్వటం మంచిది కాదంటావా?"

"అది కాదే అయ్యా…మొన్నీ మద్దెన పట్నంలో పురుగు మందులు కొనటానికి వెళ్లినప్పుడు అక్కడ సంగపోల్ల మీటింగు జరుగుతుంటే, సరికదా అని చూడటానికి వెళ్ళా."

"ఏది ఆ యెర్ర జండా వాళ్ళ దా ?"

"ఆ అదే. వాళ్ళు ఈ రోజుల్లో రైతుకు జరుగుతున్న అన్యాయాలను గురించి వివరంగా చెప్పారు."

"ఏం చెప్పారేమిటి?"

"రైతుల నుండి భూమి లాక్కోవటానికి నేడు ప్రభుత్వం, పెట్టుబడిదారులు, వ్యాపారులు అనేక మార్గాలను అవలంబిస్తున్నారు. ప్రాజక్టుల పేరుతో, హబ్బులని, ఫ్యాక్టరీలని, రింగు రోడ్లని, కారిడార్లని అనేక పేర్లతో రైతుల నుండి భూమిని వేరు చేస్తున్నారు. ఆ భూమిని తరవాత రియల్ వ్యాపారానికి ఉపయోగించుకొని వంద రెట్ల ఆదాయాన్ని పొందుతున్నారు. రాను రాను వ్యవసాయం తగ్గి పోయి తినటానికి తిండి కూడా దొరకని పరిస్తితి వస్తుందేమో ?"

"కాని ఈళ్ళు చెప్పేది అది కాదు కదా. మన భూమి మన దగ్గరే ఉంటుంది కదా! ఐదేళ్ళ తర్వాత మన భూమి మనకు వస్తుంది. తర్వాత కావాలంటే అద్దె గడువు పెంచచ్చు, లేదంటే మానుకోవచ్చు".

"వాళ్ళేమన్నా పిచ్చివాళ్ళా అయ్యా… మనకు అంత డబ్బు ఎందుకు ఇస్తామంటున్నారో ఒక సారి ఆలోచించు. వాళ్ళు చెప్పిన పంట వేయాలట, వాళ్ళు ఇచ్చిన ఎరువులు వాడాలి, వాళ్ళిచ్చిన పురుగుమందులు వాడాలి. మన నేల లో పండని పంటని బలవంతంగా పండించి, వాళ్ళ ఫ్యాక్టరీలో ఉపయోగించుకొని కోట్లకి కోట్లు గడిస్తారు. వాళ్ళిచ్చిన ఎరువులు, పురుగుమందులు వాడి ఐదేళ్ళ తర్వాత మన నేల బీడు పడి ఏ పంట వేయటానికి పనికి రాకుండా పోతుంది."

"అమ్మో ఇందులో ఇంత కత ఉందా?" ఆశ్చర్య పోయాడు రంగయ్య.

"అవునయ్యా… ఇంతకూ ముందు ఉత్తరాదిన ఇలానే జరిగి మహా నదులు ప్రవహించే చోటే భూములు బీళ్ళు పడిపోయినయిట. ఇప్పుడు అక్కడి రైతులు ఉన్న భూమిని రియల్ వ్యాపారులకి చౌకగా అమ్మి రోడ్డున పడుతున్నారట."

"అయ్యా బాబోయ్. ఇంత యవహారం ఉందా ఇందులో. నీవు సదువుకున్న వాడివి కాబట్టి ఇంత చెప్పగలిగావు. లేక పోతే మనం మోసపోయే వాళ్ళమేగా! చస్తే నా నేల తల్లిని నేను వదులుకోను. అంతే కాదు ఈ విషయాలన్నీ మన రైతు సోదరులకి చెప్పి అపరమతం చేయాలి. దీనికి నీలాగా సదువుకున్న వాళ్ళు ముందుకు వస్తే, అమాయక రైతులు మోసపోకుండా ఉంటారు. ఎలాగయినా ఈ యాపారుల నుండి నేల తల్లిని రక్షించాలి " అంటూ వంగి మట్టిని గుప్పెటలో తీసి కళ్ళకద్దుకున్నాడు రంగయ్య ఆప్యాయంగా.



## కవిత

# గుండె బరువు

ములుగు లక్ష్మీమైథిలి

9441685293




నాల్గుగోడల మధ్య ఏం జరిగినా
ఎవరికీ తెలియదనుకుంటావేమో..
గోడలకు చెవులేకాదు కళ్ళు ఉంటాయి
గోడలు మాట్లడం మొదలెడితే
పచ్చినిజాలు చెప్తాయి మరి...
కట్నం కోసం నవవధువును మంటల్లో
తగలేసినపుడు
మొగుడు తాగొచ్చి పెళ్ళాన్ని చావబాదినపుడు
అబలల మానప్రాణాలు హరించినపుడు
ఇంకా ఎన్నో ఎన్నో... చెపుతాయి
గోడలు మన జ్ఞాపకాల అలమర దొంతరలు
నీడనిచ్చేగోడ.... మన గోడూ వింటుంది
పాతగోడలు ఎన్ని తరాల బాధలు మోస్తున్నాయో తెలిస్తే
అవి ఎందుకు పెచ్చులూడాయో తెలుస్తుంది...
పురావస్తుశాఖవారినడిగితే..
నిధులు, నిక్షేపాలే కాదు.. నిజాలు చూపిస్తారు

ఎందరో తల్లిదండ్రులు ఈ గోడకు తల ఆన్చి
ఎన్ని బాధలు చెప్పుకున్నారో?...
ఎన్నిసేర్లు వారికంటి నీరు ఆ ఇంటిగోడను
తడిపిందో..?
'అమ్మా నాన్నా' మీరు చేసే అల్లరికి వేసే కేకలు
'అన్నం తినరా' అంటూ పిలిచే ప్రేమలు
ఇంకా ఆ గోడల్లో ప్రతిధ్వనిస్తున్నాయి
గోడమీద పిల్లులు ఉన్నట్టుండి
మీరు 'పై' సంపాదనకై "పై" దేశాలకు వెళ్ళినపుడు
ఆ ముసలి తల్లిదండ్రులను...
ఆ గోడలే ఆసరా ఇచ్చి నడిపించాయి
ఇదే పునరావృతమై....
ఆత్మజ్ఞానం పొందినపుడు తెలుసుకుంటారు
ఇపుడు గోడలు ఇంటి బరువేకాదు
తన వారి గుండె బరువును మోస్తున్నాయి

---

# మినీలు

పాలపర్తి ధనరాజ్

9550593901



తాగిన బొండాల
గ్యారేజీ
డ్రైనేజీ

హైస్పీడు వాహనాలు వెళ్తుంటే
ఆకాశంలో తిరుగుతున్నాయి
ఆశగా చూస్తూ
రాబందులు

ప్రతి ఇద్దరి మధ్య
మాటల మూట
మూడోవాడు

మనసుని
తడిపే
బిందుసేద్యం
కన్నీళ్లు

రెక్కలు తెగిన
పక్షుల నిలయాలు
వృద్ధాశ్రమాలు

యువతకు
తారేజమీన్‌పర్
సినీతారలు

రెండిళ్ళ మధ్య
భారీ ప్లాటు
ఫ్రీ డస్ట్‌బిన్

జండాలు ఎజెండాలే
స్టాపు
లంచాలు అవినీతి
నాన్‌స్టాప్

యువత
ఆరోప్రాణం
సెల్‌ఫోను

మనజాతికి
సెలైన్
క్రికెట్

తిట్లకి
ఎన్‌సైక్లోపేడియాలు
పార్టీ నాయకులు

# భావ ప్రకటనపై బందూకులా?



1. కల్బుర్గి
2. గోవింద్ పన్సారె
3. నరేంద్ర దబోల్కర్

*నిత్యం అనేకమంది విద్యార్థులు, విద్యావేత్తలు, సాహితీవేత్తలూ వచ్చిపోయే కాల్బుర్గి ఇంటికి ఆగస్టు 30న ఇద్దరు దుండగులు రావడం, ఆయన తలుపు తీసీతీయగానే కాల్పులు జరిపి, మోటారు బైకుపై పారిపోవడం క్షణాల్లో జరిగిపోయాయి. ఇలాంటి దారుణాన్ని చవిచూడాల్సి వస్తుందని అరాచక శక్తులు ఆయన్ని కొద్దికాలంగా బెదిరిస్తూనే ఉన్నాయి. వాటికి ఏమాత్రం వెరవని 77 ఏళ్ల ఆ వృద్ధ సాహితీవేత్త పిరికిపందల దుస్సాహసానికి ప్రాణాలు కోల్పోయారు.*

**- సత్యాజీ**
**9490099167**

దేశంలో మతోన్మాద శక్తుల ఆరాచకత్వం పేట్రేగిపోతోంది. ముఖ్యంగా సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో వాటి అమానవీయ విధ్వంసం, అసహనం పరాకాష్టకు చేరుకుంటోంది. ప్రఖ్యాత కన్నడ సాహిత్యవేత్త, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, విద్యావేత్త ప్రొఫెసర్ ఎం. మల్లేశప్ప కాల్బుర్గి అమానుష హత్య దీనికి తాజా ఉదాహరణ. నిత్యం అనేకమంది విద్యార్థులు, విద్యావేత్తలు, సాహితీవేత్తలూ వచ్చిపోయే కాల్బుర్గి ఇంటికి ఆగస్టు 30న ఇద్దరు దుండగులు రావడం, ఆయన తలుపు తీసీతీయగానే కాల్పులు జరిపి, మోటారు బైకుపై పారిపోవడం క్షణాల్లో జరిగిపోయాయి. ఇలాంటి దారుణాన్ని చవిచూడాల్సి వస్తుందని అరాచక శక్తులు ఆయన్ని కొద్దికాలంగా బెదిరిస్తూనే ఉన్నాయి. వాటికి ఏమాత్రం వెరవని 77 ఏళ్ల ఆ వృద్ధ సాహితీవేత్త పిరికిపందల దుస్సాహసానికి ప్రాణాలు కోల్పోయారు. ఈ సంఘటన సభ్య సమాజాన్ని దిగ్భ్రాంతపర్చింది. తమకు ఇష్టం లేని ప్రశ్నపైనా, వాదన పైనా తీవ్ర అసహనానికి, అహంకారానికీ గురవుతున్న మతోన్మాద, కులోన్మాద శక్తుల పాశవిక పంథాకు అద్దం పట్టింది ఈ దుర్ఘటన.

ఈ దేశంలో రెండేళ్ల కాలంలో ప్రజాస్వామికవాదులపై జరిగిన మూడో దారుణం ఇది. సరిగ్గా రెండేళ్ల క్రితం 2013 ఆగస్టు 20వ తేదీ ఉదయం మహారాష్ట్రలో ప్రముఖ హేతువాది, రచయిత నరేంద్ర దబోల్కర్‌ను ఇలాగే కాల్చి చంపారు. మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా ఆయన అపుపెరక్కుండా పోరాడారు. దైవదూతలుగా చెప్పుకుంటూ అరాచకాలకు, కామ ప్రకోపిత వికృతాలకు పాల్పడుతున్న స్వామీజీలు, బాబాల బండారాన్ని బయటపెట్టాడు. ఇలాంటి మోసాల పట్ల ప్రజలు అప్రమత్తంగా ఉండాలని జాగృత శంఖం పూరించాడు. ఎన్నో రచనలు చేశాడు. మహారాష్ట్రలో అంధ విశ్వాసాలకు వ్యతిరేకంగా చట్టం తేవడానికి అవిరళ కృషిచేశారు. ఈ సమాజాన్ని ఇలాగే మూఢ నమ్మకాల్లో ఉంచి, తమ పబ్బం గడుపుకోవాలనే స్వార్థపరశక్తులకు ఇది నచ్చలేదు. బెదిరించారు. భయపెట్టారు. కానీ, ఆయన వెరవకుండా నమ్మిన బాటలోనే నడిచారు. ఉన్మాదులు కాల్చి చంపారు. ఈ ఏడాది ఫిబ్రవరి 16న అదే మహారాష్ట్రలో మరొక దారుణం. సిపిఐ నేత, రచయిత, టోల్‌గేట్ వ్యతిరేక ఉద్యమకర్త అయిన గోవింద్ పండరీనాథ్ పన్సారే తన భార్యతో మార్నింగ్ వాక్‌కు వెళ్లి వస్తుండగా, దుండగులు కాల్పులు జరిపి పారిపోయారు. అరాచకశక్తుల ఆగడాలకు వ్యతిరేకంగా పనిచేయడం, రచనలు చేయడం ఆయన చేసిన నేరం. అదే విధంగా ఎంఎం కాల్బుర్గుని పొట్టన పెట్టుకున్నారు. దీనికి ముందు తమిళనాడులో పెరుమాల్ మురుగన్ అనే నవలా రచయిత పట్ల కూడా కులోన్మాద అరాచక శక్తులు తీవ్ర దౌర్జన్యానికి పాల్పడ్డాయి. వందేళ్ల క్రితం

నాటి ఒక సాంప్రదాయాన్ని ఒక నవల్లో సూచనప్రాయంగా పేర్కొనటం ఆ శక్తుల కన్నెర్రకు కారణం అయింది. అధికారులు రచయితకు రక్షణ ఇవ్వాల్సింది పోయి, వారి సమక్షంలోనే అభ్యంతర కారులకు మురుగన్ చేత క్షమాపణ చెప్పించారు. దాంతో మనస్తాపం చెందిన పెరుమాళ్ 'రచయితగా నేను చనిపోయాను' అని తీవ్రమైన ప్రకటన చేశారు.


పెరుమాళ్ మురుగన్

ఈ సంఘటనలు ఎక్కడెక్కడ జరిగినా అవి ఒకదానికొకటి సంబంధం లేనివి కావు. యాదృచ్ఛికంగా జరిగినవి కాదు. మతోన్మాద, కులోన్మాద శక్తుల ఉధృతే వీటన్నిటికీ కారణం. ఆ శక్తుల అరాచకాల పట్ల పాలకుల ఉదాసీన వైఖరి, పాలకపక్షంలోని కొంతమంది తరచూ ప్రకటనల రూపంలో చేస్తున్న దుర్బోధలూ ఈ ఉదంతాలకు పురిగొల్పుతున్నాయి. ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు వంటి సాంస్కృతిక విషయాల్లో ఏకస్వామ్యం సాధించే దిశగా ఈ శక్తులు పనిచేస్తున్నాయి. 'నువ్వు ఉంటే మేము చెప్పినట్టు ఉండు. లేకుంటే నీ పని పడతాం' అన్న పెత్తందారీ ధోరణితో పేట్రేగుతున్నాయి. కాల్బుర్గి హత్య తరువాత భజరంగ్ దళ్ తరపున దాని ప్రతినిధి భవిత్ శెట్టి చేసిన ట్విట్టర్ ఈ కిరాతక ఆలోచనకు తార్కాణం. 'మొన్న యు.ఆర్. అనంతమూర్తి, నేడు కాల్బుర్గి, తరువాతి లక్ష్యం కెఎస్ భగవాన్' అంటూ అతడు హిట్‌లిస్టు ప్రకటించాడు. తమకు ఇష్టం లేని భావాల పట్ల మతోన్మాద శక్తులు ఎంత ధైర్యంగా, ఎంత బహిరంగంగా చెలరేగిపోతున్నాయో దీనిని బట్టి అర్థమవుతోంది.

> కందుకూరి వీరేశలింగం వితంతు పునర్వివాహాలను ప్రోత్సహించాడు. స్త్రీ విద్యకు విశేష కృషిచేశాడు. బాల్య వివాహాలు ఎంత హేయమో, అన్యాయమో 'కన్యాశుల్కం' నాటకం రాసి చాటాడు మహాకవి గురజాడ అప్పారావు. సుబ్రహ్మణ్య భారతి, నారాయణ గురు, జ్యోతిబా పూలె, సావిత్రి భాయి పూలే, అంబేద్కర్, మహాత్మాగాంధీ... ఇలా ఎందరో సామాజిక అంతరాలను, దురన్యాయాలను నిరసించారు.

వాస్తవానికి భారతీయ సమాజంలో ప్రత్యామ్నాయ ఆలోచనా స్రవంతి మొదటినుంచీ ఉంది. చార్వాకులు, లోకాయతులు భౌతికవాద దృక్పథాన్ని, లౌకిక విలువల ఔన్నత్యాన్ని చాటుతూ వచ్చారు. తరువాతి కాలంలోనూ ప్రజాకవులూ, తత్వవేత్తలూ ఏదొక యథార్థవాదాన్ని వినిపిస్తూ వచ్చారు. ప్రజాకవి వేమన మూఢనమ్మకాల్ని చీల్చి చెండాడాడు. సామాన్యులకు సైతం అర్థమయ్యే పదాలతో ఆటవెలదులు వెలయించాడు. పోతులూరి వీరబ్రహ్మం కులమతాలు కల్పితాలే తప్ప, కావాల్సినవి ఎంతమాత్రం కాదన్నాడు. మాదిగ కక్కయ్యను, మహ్మదీయ సిద్ధయ్యను శిష్యగణంలో చేర్చుకుని, సమానత్వం చాటాడు. రాజా రామ్మోహన్ రాయ్ సతీసహగమనాన్ని తీవ్రంగా నిరసించాడు. ఇది దుర్మార్గమని ఎలుగెత్తాడు. నిర్మూలనకు కృషి చేశాడు. తెలుగునాట కందుకూరి వీరేశలింగం వితంతు పునర్వివాహాలను ప్రోత్సహించాడు. స్త్రీ విద్యకు విశేష కృషిచేశాడు. బాల్య వివాహాలు ఎంత హేయమో, అన్యాయమో 'కన్యాశుల్కం' నాటకం రాసి చాటాడు మహాకవి గురజాడ అప్పారావు. సుబ్రహ్మణ్య భారతి, నారాయణ గురు, జ్యోతిబా పూలె, సావిత్రి భాయి పూలే, అంబేద్కర్, మహాత్మాగాంధీ... ఇలా ఎందరో సామాజిక అంతరాలను, దురన్యాయాలను నిరసించారు. సమానత్వం భాసిల్లే సమాజ నిర్మాణం కోసం పాటుపడ్డారు.

ఈ మహానుభావుల కృషి నల్లేరు మీద బండి నడకలా సవ్యంగా సాగిపోలేదు. సనాతన వాదులు, యథాతథ వాదులు తీవ్రంగా అడ్డుపడ్డారు. మార్పునకు వీల్లేదని భీష్మించారు. వాదోపవాదాలు విస్తృతంగా సాగాయి. కానీ, చిట్టచివరికి కాలానికి నిలబడింది శాస్త్రీయవాదమే! అప్పుడు వీరేశలింగాన్ని, గురజాడను, రాజారామ్మోహన్ రాయ్‌నీ తీవ్రంగా వ్యతిరేకించిన వాళ్లు వారిపై భౌతిక దాడులకు తెగబడలేదు. వాళ్లను అంతం చేసి, భయోత్పాతం కలిగించలేదు. మతసామరస్యాన్ని ప్రబోధించిన మహాత్మాగాంధీ మీద మాత్రం అలాంటి దారుణం జరిగింది. ఆర్ఎస్ఎస్ కుదురులోంచి వచ్చిన నాథూరాం గాడ్సే – గాంధీని కాల్చి చంపి, దేశంలో మతోన్మాద అకృత్యానికి ఆజ్యం పోశాడు. ఆ ఆర్ఎస్ఎస్ మూలాధారంగా గల రాజకీయ శక్తులే ఇప్పుడు అధికారంలో ఉన్నాయి. ఇన్నాళ్లి మన దేశ లౌకిక పునాదికి, సామరస్య స్వభావానికి బీటలు వార్చే విచ్ఛిన్నకర వ్యూహాన్ని పకడ్బంధీగా సాగిస్తున్నాయి.

ఏ భావజాలంతో అయితే గాంధీని హత్య చేశారో, ఆ భావజాలానికి అనుగుణంగా ఇప్పుడు చరిత్రను, సాహిత్యాన్ని తిరగ రాసే ప్రయత్నం ముమ్మరమైంది. కాల్బుర్గి హత్య అలాంటి ప్రేరణతోనే జరిగింది. కాల్బుర్గి కన్నడ సాహిత్యంపై విస్తృత పరిశోధన చేసిన విద్యావేత్త. 12వ శతాబ్ది నాటి బసవన్న వీరశైవానికి ప్రతినిధి. వీరశైవం అనేది మత క్రతువులకు భిన్నమైనది. విగ్రహారాధనకు వ్యతిరేకం. ఆ విషయాలనే కాల్బుర్గి 'మార్గ' అన తన పరిశోధనా వ్యాస సంకలనంలో పేర్కొన్నాడు. కుల వ్యతిరేక దృష్టి కూడా బసవన్న

# నమ్మకాల నానార్థ నిఘంటువు చదవాల్సిందే

- వల్లభాపురం జనార్దన
9440163687

సమాంతర సర్కారై
బోరవిరుచుకు తిరుగుతున్న మతోన్మాదం
ధర్మ సంస్థాపన యజ్ఞం షురూ
భావ ప్రకటన స్వేచ్ఛపై మౌలిక నిషేధాజ్ఞలు
నీ కనురెప్పలు తెరువనివ్వవు
పెదవితో నాలుకను జో కొట్టాల్సిందే
మతాచారాల విశ్వసనీయతను
ప్రశ్నించే గొంతుల చుట్టూ
బిగుస్తున్న ఇనుప వలలు
నిషేదాజ్ఞల డైరెక్షన్ లోనే
నీకాళ్ళు నడవాలి
నీ చేతులు పనిచేయాలి
వినకూడని, పలకకూడని మాటల లిస్టు
తాళమై చెవికి నాలుకకు వేలాడుతుంది
ఉల్లంఘిస్తే లేపేయడమే
నీవు రాస్తున్న అక్షరమే
నీ పట్ల మానవ బాంబై పేలుతుంది
నిన్ను శకలాలుగా మారుస్తుంది
నీ కలం నీవు రాయాలన్నది రాయకుండా
గిరఫ్థార్ అవుతుంది
ఏముంది అంతా ఓ.కే.
సర్వేజనా సుఖినోభవంతు
దొంగలు, హంతకులు సుఖంగా బతకొచ్చు
నీకు మాత్రం స్వేచ్ఛగా
ఊపిరి పీల్చుకొనే అవకాశం లేదు
నీ దిన చర్య నైతిక పోలీసులు నిర్ణయించాలి
నమ్మకాల నానార్థ నిఘంటువు చదివిస్తుంది
ఇక రాత్రిని పాడే అక్షరాలదే రాజ్యం
వెలుగు ఉలిమొనలు విరిగిపోవాల్సిందే
భయం నీ బతుకు చుట్టూ
నైతిక పోలీసుల పద్మవ్యూహం చుట్టు ముట్టుతుంది
దేశభక్తికి డి.ఎన్.ఎ. పరీక్ష అవసరం లేదు
లౌకిక తత్వానికి, హేతువాదానికి
డి.ఎన్.ఎ.పరీక్షలు
మతోన్మాద ప్రయోగశాలలో జరుగుతాయి



ఉద్యమంలో ఒక భాగంగా ఉందని చెబుతూ, తన వ్యాసంలో ఒక ఉదంతాన్ని ప్రస్తావించాడు. బసవన్న సోదరి పెళ్లి కాకుండానే ఇంట్లో ఉందని, ఆమెకు, ఒక చర్మకారుడికి కలిగిన బిడ్డే చెన్న బసవడు అని ఉదాహరణగా చెప్పాడు. ఇలా చెప్పడం మతోన్మాద శక్తులకు సహించలేదు. 12వ శతాబ్దిలో జరిగిందని చెప్పే సంఘటనకు వీరు ఈ కాలంలోంచి ధర్మసూత్రాలను ఆపాదిస్తూ.. దూషణలకు, దాడులకు, ఆఖరికి హత్యకూ తెగబడ్డారు. కాల్బుర్గి ఒక విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలర్‌గా పనిచేసిన విద్యావేత్త. చరిత్ర ఆధారం లేకుండా ఏ ఉటంకింపూ చేసే అవకాశం లేదు. పోనీ, దానికి భిన్నమైన సమాచారం ఉంది అనుకుంటే - దాని ఆధారంగా వాదించవచ్చు. కోర్టునూ ఆశ్రయించవచ్చు. కానీ, అలాంటి ప్రజాస్వామిక పద్ధతులను వారు అనుసరించలేదు. అనాగరిక దుస్సాహసానికి ఒడిగట్టారు.

రచయితల, కవుల, కళాకారుల భావప్రకటనా స్వేచ్ఛపై ఇలాంటి దాడులు దేశానికి అత్యంత హానికరం. అనేక భాషా సంస్కృతులు, భావజాలాలూ సమ్మిళతమైన మనదేశంలో మతోన్మాద కాపలాదారుల పహారా విచ్ఛిన్నానికి, విధ్వంసానికి దారితీసే ప్రమాదం ఉంది. అనేక ఆలోచనలూ, భావాలు సంఘర్షించకుండా కొత్తదారులు కనుగొనలేము. ప్రశ్న లేకుండా పురోగమనం సాధ్యం కాదు. ఒక బెదిరింపుతోనే, హత్యతోనే మూగబోయే నిస్సత్తు సమాజం కాదు మనది. ప్రశ్నలు పరంపరగా సాగిన అభ్యుదయ వారసత్వం మనకు ఉంది. మురికి భావాలను పట్టుకువేలాడే పరమ ఛాందసులను దాటి వచ్చిన సమున్నత చరిత్ర ఉంది. ఆ దారిలోనే ఇప్పుడు కవులూ, రచయితలూ, కళాకారులూ, అభ్యుదయవాదులూ గొంతెత్తి నడవాలి. 'మేం బెదరం. భయపడం. కాల్బుర్గి భావాలు, దబోల్కర్ ఆలోచనలు, గోవింద పన్సారే ఆశయాలూ ముందుకు తీసుకు వెళతాం.' అని ప్రతిన పూనాలి.



## కవిత్వోదయం




**- ఎల్.ఆర్. వెంకటరమణ**

**వెల : 60/- పేజీలు: 71**

**ప్రతులకు : 98661 58908**

'ఎవరి బాగు వారే చూసుకోవాలి' అనే సూత్రం సమిష్టి జీవితాన్ని చిందరవందర చేస్తోంది ఈనాటి సమాజంలో మేల్కొన్న కవులందరికీ ఇదే ప్రధాన వస్తువైంది. శాంతియుతమైన జీవితాన్ని భంగపరిచే ప్రతి సాంస్కృతికాంశమూ, అక్షరరూపాన్ని తీసుకుంటోంది. ఇలాంటి కవిపరంపరలోకి ప్రవేశిస్తున్న కవి ఎల్.ఆర్. వెంకటరమణ

**- అద్దేపల్లి రామమోహనరావు**

## పూలపిట్ట




**- ఏకవాక్య కవితా సోయగం**

**వెల : 100/- పేజీలు: 96**

**ప్రతులకు : 9246415150**

'ఒక కవిత ఆసాంతం బాగుండచ్చు కానీ ముగింపు పంచ్‌లైన్స్ ఉంటాయి చూడండి. అవి కవితకు ప్రాణం పోస్తాయి. అలాంటి ముగింపు వాక్యమే ఈ ఏకవాక్యం చదవగానే ముందు వెనుక మరో 4 లైన్స్ రాసిస్తే ఒక చక్కని కవితగా మారిపోతుంది. అనిపించేదే ఈ 'ఏకవాక్యం

**- ఆర్.వి.ఎస్.ఎస్. శ్రీనివాస్**

## ఎప్పటికీ కొత్తగానే..




**- కొండ్రెడ్డి కవిత్వం**

**వెల : 90/- పేజీలు: 112**

**ప్రతులకు : 9948774243**

'కొండ్రెడ్డి కవిత్వ స్వభావం ఉద్వేగపూరితమైనది. ఉద్రేకం కాదు. కవితాధార ధారాళం. ఓ కవిత మొదలైనకాడి నుండి ముగింపు దాకా ఒక వేగ సూత్రత ఇతనికి నైసర్గికం. సంస్కృత బహుళ పద ప్రయోగం ఇతని బలమూ, బలహీనత కూడా.

**- డా॥ ఎన్. గోపి**

## మాటల మడుగు




**- మెర్సీ మార్గరేట్ కవిత్వం**

**వెల : 100/- పేజీలు: 140**

**ప్రతులకు : 04064643525**

ఇప్పుడు కవిత్వం రాయడమంటే వెన్నెల్లో మల్లెపూల పడక కాదు సుమా! నిప్పుల మీద నడక! ఎందుకంటే పురుష హింస రాజ్యహింస కంటే తక్కువేంకాదు. ఇప్పటికే ఈ హింస మీద మార్గరేట్ బలంగా స్పందించింది. తనదైన గొంతుకతో నినదించింది.

**- ఎండ్లూరి సుధాకర్**

## కవిత్వం ఓ సామాజిక చైతన్యం




**- డాక్టర్ రాధేయ**

**వెల : 140/- పేజీలు: 190**

**ప్రతులకు : 9985171411**

ఒక వస్తువుని చెబుతూ ఒకే వేదిక మీదికి వచ్చిన అనేక మంది కవుల పద్యపాదాలు - నిక్కంగా సహృదయ హృదయామోదాలు అవుతుంటే, వాటిని చదువరులకు ప్రదానం చేసిన రాధేయ తీరు అబ్బుర పరుస్తున్నది. ఈ రచన ద్వారా రాధేయ వర్తమాన సమాజ స్థితిగతులపై కవుల స్పందనని ఒక 'బిగ్‌పిక్చర్'గా ఒక్కచోట దర్శించే అవకాశాన్ని మనకు కలిగించారు.

**- విహారి**

## మీరు కథ వ్రాయాలనుకుంటున్నారా?




**- టి.యస్.ఎ. కృష్ణమూర్తి**

**వెల : 60/- పేజీలు: 75**

**ప్రతులకు : 9347298942**

ప్రతిరోజూ కొంత నోట్సు తయారు చేసుకుని మరుసటిరోజు దాన్ని బేస్ చేసుకుంటూ ప్రతిరోజూ రెండు గంటలపాటు నవోదయ హయ్యర్‌క్లాస్ విద్యార్థులకు నెలరోజుల పాటు కథలు వ్రాయడానికి సంబంధించిన సృజనాత్మక విషయాలను, విధానాలనూ గూర్చి నాస్థాయిలో బోధించగలిగాను. ఆ అనుభవాలతో 'మీరు కథ వ్రాయాలనుకుంటున్నారా?' అన్న ఈ చిరుగ్రంథాన్ని వ్రాయ సంకల్పించాను.

**- టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి**

## ప్రియమైన.. మీకు గుప్పెడు




- గండికోట వారిజ

వెల : 170/- పేజీలు: 72

ప్రతులకు : 9666604019

రంగుల భావాలను పొందికగా, జాగ్రత్తగా ఒడిసిపట్టుకుని, వాటిని తగిన పదాలలోని అనువదించగల నేర్పు ఉండాలి. ఈ నేర్పు ఎవరినైనా కవిని చేస్తుంది. వారిజ ఆ సాధనలోనే ఉంది. ఇందులోని కొన్ని కవితలలో ఆ పట్టు సాధించింది కూడా.

- వాడ్రేవు వీరలక్ష్మీదేవి

## రాయలసీమ నవల




- డా॥ పొదిలి నాగరాజు

వెల : 350/- పేజీలు: 375

ప్రతులకు : 9052038569

1950కి ముందు వచ్చిన నవలల్ని నాగరాజు విశ్లేషించడం చదివితే నవల విషయంలో రాయలసీమ ఇప్పటిదాకా అందరూ అనుకుంటున్నంతగా వెనకబడి పోలేదు అన్న అభిప్రాయం కలుగుతుంది. అంతే కాదు, తెలుగు నవలా చరిత్రను తిరిగి రాయవలసిన అవసరాన్ని ఈ గ్రంథం నొక్కి చెబుతుంది.

- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి

## గుడిసె గుండె




- దేవరాజు మహారాజు

వెల : 60/- పేజీలు: 66

ప్రతులకు : 668008807676

సంపుటి మొత్తం భావం, శిల్పం, ప్రబలంగా అల్లుకున్న కవిత్వానికి ప్రతీక. కొన్ని కవితల్ని చదివి కదిలిపోయి, కొన్నిటిని చదివి నా దేవరాజు, మహారాజులా ఎంత మంచి కవిత్వం రాశాడని పొంగిపోయాను.

- డా॥ సి. నారాయణరెడ్డి

## హంద్రీగానం




- జి. వెంకటకృష్ణ

వెల : 50/- పేజీలు: 54

ప్రతులకు : 8985034894

ఇది సందిగ్ధ హృదయగానం / చారిత్రకంగా దాపురించిన/ స్థితిదీనత్వం /నాయకత్వాలు వరాభవమైన గతమూ/నాయకత్వాలు వనరులై/ యితరులకు వినియోగమైన వర్తమానమూ / ఆలపిస్తున్న పరాధీనగీతం

- జి. వెంకటకృష్ణ

మహాకవి, మొహమ్మద్
## ఇక్బాల్ గీతాలు




- డా॥ అల్లూరి వేంకట నరసింహరాజు

వెల : 100/- పేజీలు: 95

ప్రతులకు : 9440136665

ఉరుదూ, పారశీక భాషలు తెలిసిన వారికీ, తెలియని వారికీ మూల లిపి తెలిసిన వారికి, తెలియని వారికి – సామాన్య తెలుగు పాఠకులకు సైతం ఇక్బాల్ సాహిత్యాన్ని పరిచయం చేయాలనే ఆకాంక్షతో మూలము, తెలుగు లిపిలో ఇక్బాల్ గేయము, నా అనువాద గీతము వరుసగా పొందుపర్చాను.

- డా॥ అల్లూరి వేంకట నరసింహరాజు

## అమూల్య




- కె. సుభాషిణి కథలు

వెల : 100 /- పేజీలు: 191

ప్రతులకు : 9440254730

వర్తమాన సామాజిక వాస్తవికత పట్ల పాఠకులకు అవగాహన కల్పించడం ప్రజాసాహిత్యం చేసే పని. అవగాహనకే పరిమితం కాకుండా సామాజిక స్పృహకే పరిమితం కాకుండా, రచయితల వ్యాఖ్యల ద్వారా పాత్రల సంభాషణల ద్వారా కథల ముగింపు శిల్పం ద్వారా సామాజిక చైతన్యాన్ని రగిలించడం తెలుగు సాహిత్యంలో మరో కోణం, సుభాషిణి కథలు ఈ కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాయి.

- రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

# కల్బుర్గి హత్యపై నిరసన సభలు




విశాఖలోని పౌరగ్రంథాలయంలో సెప్టెంబర్ 14న సాహితీస్రవంతి ఆధ్వర్యంలో కల్బుర్గి హత్యకు ఖండిస్తూ జరిగిన సభ. చిత్రంలో సిఐటియు రాష్ట్ర ఉపాధ్యక్షులు సిహెచ్. నర్సింగరావు, సాహితీస్రవంతి అధ్యక్షులు తెలకపల్లి రవి, విశాఖ సాహితీస్రవంతి ప్రధాన కార్యదర్శి నూనెల శ్రీనివాసరావు

మన దేశంలో అధికారిక టెర్రరిజం అమలవుతుందని సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అన్నారు. మతోన్మాద ఆగడాలను ముక్తకంఠంతో ఖండించాలని అన్నారు. ఇటీవల ప్రముఖ హేతువాదులను హత్యచేస్తున్న మతఛాందసవాదంపై ప్రధాని మోడీ, మంత్రివర్గ సభ్యులు కనీసం మాట్లాడకపోవడం ఏ రకమైన సంకేతాలు ఇస్తోందని ప్రశ్నించారు. మౌనాన్ని అంగీకారంగా ప్రజలు భావిస్తున్నారన్నారు. సెప్టెంబర్ 4న విశాఖపట్నంలో పబ్లిక్ లైబ్రరీలో 'ప్రమాదంలో భావప్రకటనా స్వాతంత్ర్యం' అంశంపై జరిగిన సభలో ఆయన మాట్లాడారు. కల్బుర్గిని చంపిన ఛాందసవాదులు మిగతా వారిని చంపుతామని ట్విట్టర్‌లో పెట్టడం ఆందోళన కల్గిస్తుందన్నారు. ఛాందసవాదులకు కనువిప్పు కలిగేలా దేశం నుంచి మతఛాందసవాదాన్ని తరిమికొడతామన్న సందేశం ఇవ్వాల్సిన బాధ్యత దేశంలో మేధావులు, యువకులు, హేతువాదులు, అభ్యుదయవాదులపై ఉందన్నారు.

సిఐటియు రాష్ట్ర ఉపాధ్యక్షులు సిహెచ్. నర్సింగరావు మాట్లాడుతూ భావ స్వాతంత్ర్యంపై జరుగుతున్న దాడిని ఎదుర్కోవడమే తక్షణ కర్తవ్యంగా ప్రతి ఒక్కరూ భావించాలని అన్నారు. సమాజాన్ని చైతన్యం చేయడం ద్వారానే మతతత్వ దాడులను ఎదుర్కోవాలన్నారు. వార్వా, సాహితీస్రవంతి నిర్వహించిన ఈ కార్యక్రమంలో పెద్దసంఖ్యలో కవులు, రచయితలు, అభ్యుదయ వాదులు పాల్గొన్నారు. సాహితీస్రవంతి విశాఖ గౌరవాధ్యక్షులు ఎన్. రమణాచలం, కార్యదర్శి నూనెల శ్రీనివాసరావు, సభ్యులు ఎస్. నాగరాజు, రామస్వామి తదితరులు సభను నిర్వహించారు. సభకు హాజరైన సాహితీవేత్తలు, వివిధ సంఘాల నాయకులు కల్బుర్గి హత్యను ఖండించారు. సాహితీవేత్త రామతీర్థ, పౌరహక్కుల సంఘం విశాఖ అధ్యక్షులు తుంపాల శ్రీరామమూర్తి, కవి,డాక్టర్ సహదేవరావు, అరసం విశాఖ కార్యదర్శి ఉప్పల అప్పలరాజు, కవి అనంతరావు, డాక్టర్ మాటూరి శ్రీనివాసరావులు కల్బుర్గి హత్యను ఖండిస్తూ మాట్లాడారు.

## విజయవాడలో...



ప్రొ॥కల్బుర్గి హత్య నేపథ్యంలో సెప్టెంబర్ 20న విజయవాడలో మాంటిస్సోరి కళాశాలలో సంగమం ఆధ్వర్యంలో జరిగిన 'లౌకిక, ఉదారవాద భావనలు - పొంచి వున్న ప్రమాదాలు' సదస్సులో ప్రసంగిస్తున్న ప్రొ॥ కె. నాగేశ్వర్. చిత్రంలో ప్రొ॥ కె. ఆంజయ్య, ఉ మామహేశ్వరరావు, కొత్తపల్లి రవిబాబు, బోసు తదితరులు

## కర్నూల్‌లో...



కర్నూల్‌లో కేంద్ర గ్రంథాలయంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో సెప్టెంబర్ 13న కల్బుర్గి హత్యకు నిరసనగా జరిగిన 'ప్రమాదంలో ప్రజాస్వామ్యం' సదస్సులో ప్రసంగిస్తున్న కె. అంజయ్య. చిత్రంలో జంధ్యాల రఘుబాబు, కెంగార మోహన్, మనోహర్, శ్రీనివాసమూర్తి, మండ్ల జయరాం, ఎస్.డి.వి. అజీజ్ తదితరులు

# దాక్షిణాత్య సాహిత్యాలు - తులనాత్మక అధ్యయనం



బెంగుళూరు విశ్వవిద్యాలయంలో జరిగిన సదస్సులో 'దాక్షిణాత్య భాషా సాహిత్యాలు - తులనాత్మక అధ్యయనం' పుస్తక ఆవిష్కరణ దృశ్యం. చిత్రంలో తెలకపల్లి రవి, మండలి బుద్ధప్రసాద్, బి. తిమ్మేగౌడ, కె. ఆశాజ్యోతి, కాత్యాయనీ విద్మహే, రాచపాళెం చంద్రశేఖ రెడ్డి

బెంగుళూరు విశ్వవిద్యాలయం స్వర్ణోత్సవాలలో భాగంగా తెలుగు శాఖ ఆధ్వర్యంలో ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన మధ్య, దక్షిణ ద్రావిడ భాషలైన తెలుగు - కన్నడ - తమిళం - మలయాళ భాషా సాహిత్యాలలోని ఆదాన ప్రదానాలను చర్చించడానికి రెండు రోజుల జాతీయ సదస్సును సెప్టెంబర్ 11,12 తేదీలలో నిర్వహించింది.

ఈ కార్యక్రమానికి బెంగుళూరు విశ్వవిద్యాలయం కులపతి ఆచార్య బి. తిమ్మేగౌడ అధ్యక్షత వహించి నాలుగు దక్షిణ భాషల తులనాత్మాక అధ్యయనం అవసరమని తెలిపారు. తెలుగు కన్నడ భాషల ఏకలిపి అవసరమని తెలిపారు.

సదస్సు లక్ష్యాలను వివరిస్తూ తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య కె. ఆశాజ్యోతి నాలుగు దక్షణాది భాషల్లో తులనాత్మాక అధ్యయనం సామాజిక అవసరమనీ, అందుకోసం ఏర్పడ్డ జాతీయ సదస్సు ఇదనీ తెలిపారు. నాలుగు భాషల్లోనూ ప్రజా సమూహాలను ఏకీకృతం చేసే సారూప్యతలను పరిశీలించడం, డయాస్పోరా సాహిత్యం - పరిశీలన, ప్రాచీన హోదా లభించిన తరువాత నాలుగు భాషల్లో సాగిన తులనాత్మక అధ్యయనం, ప్రాచీన - ఆధునిక భాషా సాహిత్యాలను తులనాత్మకంగా చర్చించడం, నాలుగు భాషల భాషావేత్తల తులనాత్మక కృషి, అనువాద సాహిత్యావసరం, నాలుగుభాషల్లో సాహిత్యం పై సాగిన స్థూల కృషి వంటి అంశాలు జాతీయ సదస్సులో కీలకాంశాలుగా తెలిపారు.

ముఖ్యఅతిథి ఆంధ్రప్రదేశ్ శాసన డిప్యూటి స్పీకర్ మండలి బుద్ధప్రసాద్ గారు మాట్లాడుతూ దక్షిణాది రాష్ట్రాలు తమ మాతృభాషలను సంరక్షించుకునేందుకు పోరాటాల కంటే సమైక్యంగా ఉంటూ కేంద్రం ద్వారా పనులు సాధించుకోవాలని అందుకు ఉద్యమించాలనీ అభిప్రాయపడ్డారు.

కీలకోపన్యాసం చేసిన ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి ప్రసంగిస్తూ దక్షిణ దేశభాషలు ప్రాచీనమైనవనీ తులనాత్మక అధ్యయనం వల్ల సాహిత్యాభివృద్ధి జరుగుతుందనీ అభిప్రాయ పడ్డారు. సాహిత్య విమర్శకులు, రాజకీయ విశ్లేషకులు తెలకపల్లి రవి మాట్లాడుతూ భాషా సంరక్షణ ఆధునికీకరణ ద్వారానే సాధ్యమన్నారు. భాషా సంస్కరణలు అవసరమన్నారు. కర్నాటక అనగానే గుర్తుకు వచ్చేది వీర శైవమని, కల్బుర్గి వంటి సాహితీవేత్త హత్యకావింపబడడం విషాదం అన్నారు. దళిత కవి, అంబేద్కర్ స్టడీస్ నిర్దేశకులు బెంగుళూరు విశ్వవిద్యాలయం, ఆచార్య సిద్ధలింగయ్య మాట్లాడుతూ తెలుగు - కన్నడ భాషల లిపి చాలా వరకు ఒక్కలాగానే ఉంటుందనీ, ఈ రెండు భాషలతో పాటు మిగిలిన రెండు భాషల తులనాత్మక అధ్యయనం పై సదస్సు స్వాగతించ దగ్గ పరిణామంగా అభివర్ణించారు.

ఆచార్య కాత్యాయని విద్మహే మాట్లాడుతూ తమిళంలో సుబ్రహ్మణ్య భారతి 'చంద్రిక' కథ సంఘసంస్కరణోద్యమ ధోరణిలో రాయబడిన వీరేశలింగం, గురజాడల భావాలను ప్రతిఫలించేదిగా ఉందని తెలిపారు. అలాగే మలయాళంలో తక్కళి శివశంకరపిళ్ళె రాసిన 'కూలిగింజలు' నవల చదివినపుడు తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం గుర్తొచ్చేదిగా ఉందని తెలిపారు. అలాగే తమిళంలో గీతాపద్మనాభన్ రాసిన 'అనంతశయనం' నవల కేరళ జీవితం చిత్రించడం, 48 గంటల నిడివిలో కథాకాలం సాగడం, ముగిసి పోవడం - అలాగే తల్లి పట్ల గల ప్రేమను గమనిస్తే అంపశయ్య, చివరకు మిగిలేది నవలలు గుర్తుకు వస్తున్నాయని తెలిపారు. కన్నడంలో నిరంజన్ రాసిన 'చిరస్మరణ' జాతీయోద్యమం నేపథ్యంలో సాగిన కథాంశంగానూ, అనుపమ రాసిన నవల 'మాధవి' తెలుగులో వచ్చిన ఫెమినిస్ట్ ఉద్యమానికి నమూనాగా భావించవచ్చుని తెలిపారు.

రెండో రోజు సమాపనోత్సవ సదస్సును బెంగుళూరు విశ్వవిద్యాలయం కులసచివులు ఆచార్య కె.కె. సీతమ్మ ప్రారంభించి మాట్లాడుతూ నాలుగు దక్షిణాది భాషలతో పాటు తుళు భాష మాట్లాడి ప్రజలు కూడా అధిక సంఖ్యలో ఉన్నారనీ, ఐతే తుళు బాషకు లిపి లేకపోవడం వల్ల తగినంత గుర్తింపు రాలేదన్నారు. దక్షిణ భాషల్లో ప్రాచీనత కారణంగా ఆంగ్లం తీవ్ర స్థాయిలో ప్రభావం చూపటం లేదన్నారు.

సమాపనోత్సవ సదస్సులో కీలకోపన్యాసం చేసిన




మృణాళిని మాట్లాడుతూ భాషా సాహిత్యాలపై ఆయా ప్రాంతాల సంస్కృతి ప్రభావం ఉంటుందని తులనాత్మక అధ్యయనం ఆ కోణంలో సాగవలసిన అవసరం ఉందని తెలిపారు. ప్రాంతాల సాహిత్యాలను తులనాత్మకంగా అధ్యయనం చేయడం మాత్రమే కాకుండా వీటి ప్రభావాలను అధ్యయనం చేయటం ఉత్తమమని తెలిపారు. దక్షిణాది భాషలు సోదర భాషలైనప్పటికీ వాటి మధ్య ఎంతో వైరుధ్యం ఉందన్నారు.

హైదరాబాదు ఉర్దూ విశ్వవిద్యాలయం ప్రో-వైస్ ఛాన్సలర్ డా.ఇక్బాల్ అహ్మద్ మాట్లాడుతూ ఏ భాషైనా ఇతర భాషలను స్వీకరించే తత్వాన్ని బట్టి తన ప్రత్యేకతను చాటుకుంటుందన్నారు. డా.జి.వి. పూర్ణచంద్ మాట్లాడుతూ తెలుగ భాష ప్రాచీనమైనదని ఆఫ్రికాలో తెలుగుకు సమానార్థకమైన పదజాలం కనబడుతుందని తెలిపారు. గోదావరి జిల్లా ప్రాంతంలోని 'పంచదార' పదం బౌద్ధుల వాడుకలోని పదమని వివరించారు. నివృత్త ఆచార్యులు డా.ఎన్.భక్తవత్సలం రెడ్డి 'ఇంటిగ్రేటేడ్ ద్రవిడియన్ లిటరేచర్' గురించి మాట్లాడుతూ ఏకీకృత ద్రావిడ సాహిత్యానికి సంస్కృతి ఆధారంగా నాలుగు భాషల తులనాత్మక అధ్యయనం అవసరమని తెలిపారు.

టంగుటూరి రామకృష్ణ మాట్లాడుతూ తమిళనాడులో నిర్బంధ తమిళం వల్ల తెలుగు కనుమరుగయ్యే అవకాశం కనబడుతోందనీ, తెలుగు - తమిళం కలగలసిన భాషా పదాలు, వాక్య నిర్మాణాలు వినడానికి కొత్తగా ప్రత్యేకంగా ఉంటాయని తమిళనాడులో తెలుగును బ్రతికించు కోవలసిన అవసరం ఉందని తెలిపారు. కోటా నాగేశ్వరరావు మాట్లాడుతూ భారత దేశం భిన్న భాషల సంస్కృతుల సమాహారమనీ దక్షిణ దేశ భాషలు ప్రాచీనమైనవని తులనాత్మక అధ్యయనం వల్ల సాహిత్యం అభివృద్ధి జరుగుతుందని అభిప్రాయపడ్డారు. డా॥ అద్దేపల్లి రమమోహనరావు మాట్లాడుతూ విద్యార్థులు తమ అధ్యయన పత్రాల ఆధారంగా క్లుప్తంగా ప్రసంగించడం సాధన చేయాలని సూచించారు.

సమాపనోత్సవ సమావేశంలో ఆచార్య కె. ఆశాజ్యోతి ప్రసంగిస్తూ రెండు రోజుల జాతీయ సదస్సు ఫలాలను వివరిస్తూ "దాక్షిణాత్య భాషా సాహిత్యాలు - తులనాత్మక అధ్యయనం" సదస్సు ఒక ప్రయత్నమనీ, సదస్సుకు వచ్చిన ప్రముఖులందరూ లోతైన పరిశీలనతో ఉపన్యాసమిచ్చారనీ తెలిపారు. ప్రవసాంధ్రులుగా ఉంటూ తులనాత్మక జాతీయ సదస్సు జరపడం వెనుక గల శ్రమ, కృషి వక్తలందరూ గ్రహించి చక్కని తోడ్పాటునందించారని తెలిపారు. తులనాత్మక అధ్యయనం భాషా సాహిత్యాలు - ఇతర భాషా సాహిత్యాలతో తులనాత్మకంగా అధ్యయనం చేయడం వల్ల తమ మాతృ భాష మాత్రమే కాకుండా ఇతర భాషలు కూడా సంపద్వంతమౌతాయని తెలిపారు. ఈ ప్రయత్నం వెనుక బెంగుళూరు విశ్వవిద్యాలయం కులపతి ఆచార్య బి.తిమ్మేగౌడ, కుల సచివులు ఆచార్య కె.కె. సీతమ్మ అందించిన తోడ్పాటు మరువలేనిదని తెలిపారు. సదస్సుకు వచ్చిన అందరికీ కృతజ్ఞతలు తెలిపారు.

జాతీయ సదస్సుకు ఆంధ్రదేశం నలుమూలల నుండి సుమారు 70 మంది పత్ర సమర్పకులు పత్ర సమర్పణ చేసారు. మద్రాసు, అణ్ణామలై, ద్రావిడ, వెంకటేశ్వర, పద్మావతి, యోగి వేమన, కృష్ణా, రాయలసీమ, హైదరాబాదు విశ్వవిద్యాలయాల నుండి ఆచార్యులు, ఉపన్యాసకులు, పరిశోధక విద్యార్థులు, ఎం.ఏ. విద్యార్థినీ విద్యార్థులు హాజరయ్యారు. 55 పత్రాలతో కూడిన 'దాక్షిణాత్య భాషా సాహిత్యాలు - తులనాత్మక అధ్యయనం' (Confluence and Contemporary Issues in South Indian Languages) పేరుతో ISBN నెంబరుతో 362 పేజీల పుస్తకం శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారిచే సదస్సు ప్రారంభోత్సవ కార్యక్రమంలో ఆవిష్కరింపబడింది.



## విశాఖ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఆరుద్ర 90వ జయంతి



సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర కర్త, అభ్యుదయ కవి, రచయిత ఆరుద్ర 90వ జయంతిని పురస్కరించుకొని సాహితీస్రవంతి, విశాఖశాఖ ఆధ్వర్యంలో ఆగస్టు 31న బీచ్‌రోడ్‌లోని ఆరుద్ర విగ్రహానికి పూలమాల వేసి నివాళి అర్పించడం జరిగింది. ఈ సందర్భంగా విగ్రహం వద్ద జరిగిన సభలో సాహితీస్రవంతి విశాఖశాఖ అధ్యక్షులు ఎ.వి. రమణారావు ప్రసంగిస్తూ తెలుగు సాహిత్యంలో ఆరుద్ర చేపట్టని, సంపద్వంతం చేయని ప్రక్రియ లేదని, ఆంధ్రుల సాహిత్య చరిత్రను శోధించి, గ్రంధస్తం చేసి భావితరాలకు అందించిన ఆరుద్రకు తెలుగుజాతి ఋణపడి ఉన్నదని పేర్కొన్నారు. అభ్యుదయ రచయితల సంఘం (అరసం) సభ్యుడు ఎ.వి.ఆర్.మూర్తి ప్రసంగిస్తూ ఆరుద్ర సాహిత్యం యొక్క విశిష్టతను, వివరించారు. ప్రజానాట్యమండలి అధ్యక్షులు దండు నాగేశ్వరరావు, కళాకారుడు చెన్నా తిరుమలరావు, ఆరుద్ర సాహిత్యం నిరంతరం పఠించాల్సిన అవశ్యకతను వివరించారు. మానసిక వైద్య నిపుణులు డా।। మోపిదేవి విజయగోపాల్ మాట్లాడుతూ ఆరుద్ర కవిత్వాన్ని విద్యార్థులకు పాఠ్యాంశంగా చేర్చాలని కోరారు. ఈ సభలో థార్వడ్‌లో హత్యకు గురైన కన్నడ రచయిత, విద్యావేత్త, హేతువాది ఎం.ఎం.కల్బుర్గికి సాహిత్యకారులు నివాళి అర్పించారు. మతోన్మాదులు చేసిన ఈ హత్యను ఖండించారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి కార్యవర్గ సభ్యులు ఎస్. నాగరాజు, సి.హెచ్.ఎల్.ఎన్.శాస్త్రి, కోటేశ్వరరావు, అరసం సభ్యులు పి.అనంతరావు, యు.టి.ఎఫ్ నాయకులు జాజులు, వై.ఆర్.కె.ప్రసాద్ తదితరులు పాల్గొన్నారు.



పెద్దాపురంలో సెప్టెంబర్‌8న జరిగిన గరికపాటి రాజారావు 52వ వర్ధంతి సభలో ప్రసంగిస్తున్న సాహితీస్రవంతి పెద్దాపురం అధ్యక్షులు డా।। జోశ్యుల కృష్ణబాబు. సభలో పాల్గొన్న ప్రజానాట్యమండలి పెద్దాపురం మండల అధ్యక్షులు దారపురెడ్డి కృష్ణ, చల్లా విశ్వనాధం తదితరులు




*ఆగస్టు 29న తెలుగుభాషాదినోత్సవం సందర్భంగా పెద్దాపురం యాసలపు సూర్యారావు స్మారకభవనంలో ప్రసంగిస్తున్న సాహితీస్రవంతి అధ్యక్షులు డా. జోశ్యుల కృష్ణబాబు, సభలో పాల్గొన్న కె. శివ, చల్లా విశ్వనాధం, గనారా, అనంతరావు*

### ప్రస్థానం చందాదారులకు, రచయితలకు విజ్ఞప్తి

**మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:**

ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం,
డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి,
గవర్నర్‌పేట, విజయవాడ - 520 002
సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

## కవితల పోటీకి ఆహ్వానం

విశాఖపట్నంలో గల పల్లంటి ఆదిలక్ష్మి (PACT) ఛారిటబుల్ ట్రస్ట్ దశమ వార్షికోత్సవ వేడుకల సందర్భంగా జాతీయ కవితల పోటీ నిర్వహిస్తున్నట్లు మహర్షి ఒక ప్రకటనలో తెలిపారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులుగా వరుసగా రూ. 1000/- రూ. 900/- రూ. 800/-, ఐదు ప్రోత్సాహక బహుమతులుగా ఒక్కొక్కటి రూ. 500/- రూపాయలు చొప్పున ఇవ్వనున్నట్లు తెలిపారు. మహర్షి, 8-23-3, పాక్ట్ వీధి, చినవాల్తేరు, విశాఖపట్నం - 530017 చిరునామాకు పంపవలసినదిగా కోరారు. ఇతర వివరాలకు 9441344503 ద్వారా సంప్రదించవచ్చును.

# అనంతకవితా స్వరాలు పుస్తకావిష్కరణ



అనంతపురం పట్టణంలో స్థానిక ప్రెస్‌క్లబ్‌లో జరిగిన 'అనంత కవితా స్వరాలు' పుస్తకవిష్కరణ సభలో ప్రసంగిస్తున్న మేడిపల్లి రవికుమార్. చిత్రంలో సురేష్, సింగమనేని నారాయణ, పి. కుమారస్వామి, డా॥ గేయానంద్.

అనంతపురంలో స్థానిక ప్రెస్ క్లబ్ లో జూన్ 28న సాహితీస్రవంతి ఆధ్వర్యంలో 71 మంది కవుల కవితా సంకలనం "అనంతకవితా స్వరాలు ఆవిష్కరింపబడింది. ఈ కార్యక్రమంలో ప్రముఖ సాహితీవేత్త మేడిపల్లి రవికుమార్ ,ప్రముఖ కథా రచయిత సింగమనేని నారాయణ శాసనమండలి సభ్యులు గేయానంద్, సాహితీ స్రవంతి ప్రధాన కార్యదర్శి సురేష్ ,సాహితీ స్రవంతి అధ్యక్షులు పిల్లి కుమారస్వామి పాల్గొన్నారు. పిల్లి కుమారస్వామి అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో సింగమనేని నారాయణ మాట్లాడుతూ ఇవాళ కవిత్వంలో వర్తమాన రాజకీయ సామాజిక సమస్యలు ప్రతిబింబిస్తున్నాయని, వీటిని వర్థమాన కవులు తమ రచనల్లో వ్యక్తీకరించడం ఎంతో సంతోషదాయకమని అన్నారు. సాహితీ స్రవంతి జిల్లా కమిటీ ఎంతో శ్రమకోర్చి వర్థమాన కవులతో ఇలాంటి సంకలనం తీసుకు రావడం మంచి పరిణామమని అన్నారు. కవిత్వం లో అభ్యుదయకర భావాలే వున్నాయన్నారు. తిరోగమన భావాలకు కాలం చెల్లిందని చెప్పారు. జిల్లాలో సాహిత్యకారులు స్తబ్దంగా వున్నప్పుడు, స్తబ్దతను బద్ధలు చేసిన సంస్థ సాహితీ స్రవంతి అని కొనియాడారు.

సాహితీస్రవంతి దర్పణం, గమనం, ప్రస్థానం ప్రత్యేక సంచికలతో ప్రారంభమైందని, ప్రపంచీకరణ, మతోన్మాదం, ఉగ్రవాదాలకు వ్యతిరేకంగా వున్న ప్రగతి శీల సాహిత్యకారులందరిని ఒక వేదికమీదకు తీసుకు వచ్చే సంస్థ సాహితీ స్రవంతి అని జిల్లా ప్రధాన కార్యదర్శి సురేష్ అన్నారు. మేడిపల్లి రవికుమార్ గారు కవితా సంకలనాన్ని సమీక్షిస్తూ అందులోని కవితలను ఉదహరించారు. 'ఒకసారి కవితావనంలో అదుగుపెట్టిన సాహసి వెనుకంజవేయడు' అంటూ చంద్రశేఖరశాస్త్రి చెప్పడం గొప్ప సాహసం అన్నారు. కవితావరణంలోకి వచ్చిన కవులు ఎన్నో కలలు కంటూ ఆ కలల సాకారం కోసం కవిత్వాన్ని ఆయుధంగా చేసుకుంటున్నారని ఆయన చెప్పడం కవిత్వం పై ఆయంకున్న అపార అభిమానాన్ని తెలియజెస్తాయని మేడిపల్లి అన్నారు. 'ఆ అంటే అమ్మకాదు, ఆ అంటే ఆవుకాదు. ఇక్కడ అ అంటే అప్పు, ఆ అంటే ఆకలి అదీ కాదంటే ఆత్మహత్య అని అక్షరమాల క్రమాన్ని కవి శ్రీనివాసరెడ్డి మార్చు చేసి చెప్పడం ఈ జిల్లా లో వున్న ప్రత్యేక పరిస్థితులను ప్రతిబింబిస్తున్నాయన్నారు. సినిమాకవుల వర్ణక్రమానికి అర్థాలు వేరని, అనంత కవులు మాత్రం వాస్తవ పరిస్థితులకు అద్దం పట్టారన్నారు. ఒకతల్లి తన పిల్లలను పురిటి లోనే చంపుతున్నందుకు బాధగా వుందని కవి ఆవేదన వ్యక్తం చేస్తున్నాడని, అలా కాక ఆ తల్లి ఆ విధంగా చేయడానికి నెట్టబడిన పరిస్థితుల గురించి కవి రాయాలని సూచించారు. రైతు ఆత్మహత్య చేసుకొన్నాడంటే అది సామాజిక హత్య అవుతుందని అందుకు మనమందరం బాధ్యులమని మేడిపల్లి రవికుమార్ అన్నారు. అందుకోసం కవులు తమ ధర్మాగ్రహాన్ని వ్యక్తం చేయడం ఎంతొ అవసరమని అన్నారు.

డా. గేయానంద్ మాట్లాడుతూ విద్యారంగం లో మార్కులపేరుతో, ర్యాంకుల పేరుతో విద్యార్థులను , తల్లిదండ్రులను మోసం చేస్తూ కార్పొరేట్ సంస్థలు విద్యారంగంలో అవినీతిని పెంచిపోషిస్తున్నారని దానిని కవులు నిగ్గదీసి తమవంతు సహకారాన్ని అందించాలని ఆయన కోరారు. సాహితీస్రవంతి అధ్యక్షులు కుమారస్వామి మాట్లాడుతూ జిల్లాలో వర్ధమాన కవులు ప్రపంచీకరణ నేపధ్యంలో వస్తున్న పెను ప్రభావాలను కవిత్వీకరించారని వాటికి అనంత కవితాస్వరాల పేరుతొ సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ప్రచురించామని ఆయన చెప్పారు. రాచపాళెంగారు దీనికి ముందు మాట రాశారని ఆయన చెప్పారు. మల్లెల నరసింహమూర్తి, తానూ సంపాదకులుగా వ్యవవహరించామని ఆయన చెప్పారు. కొమ్మినేని నవీన్‌కుమార్ వందన సమర్పణతో సమావేశం ముగిసింది.



# కాలేజీలలో 'నేను మలాలా' ఆవిష్కరణ

అతి చిన్న వయసులో నోబుల్ బహుమతి పొందిన 'మలాలా యూసుఫ్ జెయ్' జీవిత కథ సంచలనంగా మారింది. అఖిలభారత ప్రజాతంత్ర మహిళాసంఘం, ఆంధ్రప్రదేశ్ ప్రచురించిన తెలుగు అనువాదం 'నేను మలాలా' పుస్తకం వినూత్నంగా ఆవిష్కరిస్తున్నారు. మావూర్లో మలాలా అంటూ కాలేజీలలో వేలాది విద్యార్థినుల చేతులు మీదుగా, 'నేను మలాలా' నినాదాల మధ్య సంచలనాత్మకంగా ఈ పుస్తక ఆవిష్కరణ కార్యక్రమం నిర్వహిస్తున్నారు. ప్రజాశక్తి బుక్‌హౌస్, ఐద్వా సంయుక్తంగా రాష్ట్రంలోని ప్రధానమైన కాలేజీలలో విద్యార్థినీ, విద్యార్థుల చెంతకు మంచి పుస్తకాలను తీసుకెళ్ళాలన్న లక్ష్యంతో ఈ కార్యక్రమాన్ని రూపొందించారు. ఆగస్టు 28న విజయవాడలోని సిద్ధార్థ మహిళా కళాశాలలోని **3000** మంది విద్యార్థినులతో ఈ కార్యక్రమానికి మహిళాసంఘం శ్రీకారం చుట్టింది. గుంటూరులోని కిట్స్ ఇంజనీరింగ్ కళాశాలలో **2000** మంది విద్యార్థినీ విద్యార్థుల సమక్షంలో ఈ కార్యక్రమం జరిగింది. మొదటి ప్రచురణ కాపీలు **5000** అయిపోయాయని ఐద్వా నాయకురాలు కాట్రగడ్డ స్వరూపరాణి తెలిపారు. మరో పదివేల కాపీలు వేసి మరిన్ని కాలేజీలలో ఈ కార్యక్రమాన్ని నిర్వహించనున్నట్లు తెలిపారు.



విశాఖపట్నంలో 'నేను మలాలా' పుస్తకాలన్ని ఆవిష్కరిస్తున్న మంత్రి ఘంటా శ్రీనివాసరావు. చిత్రంలో గుప్తా బుక్‌షాప్ ప్రొప్రయిటర్ ప్రసాద్, ప్రజాశక్తి బుక్‌హౌస్ ఇన్‌ఛార్జి శ్రీనివాసరావు, ప్రజాశక్తి విశాఖ బ్యూరో కాంతారావు తదితరులు





తిరుపతిలో 'నేను మలాలా' ఆవిష్కరణ సభ.

విజయవాడ సిద్ధార్థ మహిళా కళాశాల ఆవిష్కరణ సభలో కళాశాల ప్రిన్సిపాల్ విజయలక్ష్మి, అంకురం డైరెక్టర్ ఉమామహేశ్వరరావు, ప్రముఖ రచయిత్రి కాత్యాయనీ విద్మహే, ఐద్వా నాయకురాలు కాట్రగడ్డ స్వరూపరాణి, ప్రజాశక్తి బుక్‌హౌస్ సంపాదకురాలు కె. ఉషారాణి.





కాకినాడ ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రారంభ సభలో సబ్‌కలెక్టర్ తదితరులు

గుంటూరు కిట్స్ ఇంజనీరింగ్ కళాశాలలో 'నేను మలాలా' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న మాజీ ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావు, ఉమామహేశ్వరరావు, ఐద్వా కార్యదర్శి రమాదవి, రావెల సాంబశివరావు, కళాశాల డైరెక్టర్ తదితరులు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

# కొడవటిగంటి కుటుంబరావు

28.10.1909–17.08.1980



మొట్టమొదటి కథ 'ప్రాణాధికం' గృహలక్ష్మి
మాసపత్రిక ఏప్రిల్ 1931 సంచికలో అచ్చయింది.
ఆనాటి నుంచి వందలకొలదీ కథలు, కల్పికలు,
పదిపన్నెండు నవలలు, నాటికలు, వేలకొలదీ వ్యాసాలు
రాశారు. కన్ను మూసేవరకు కలం కింద పెట్టలేదు.

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/13-15
Date of Positng : 30.09.2015 ▪ Date of Publication: 27.09.2015





If Un delivered please return to: Prasthanam, C/oM.B. Vignana kendram, D. No. 27-30-3, 3rd Floor, Akulavari veedhi, Governorpeta, Vijayawada - 502002, Andhrapradesh, Ph: Cell: 9490099059

**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A164 |
| పుస్తకం పేరు | ఉపస్థానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | yas |
| వెనుక అట్ట | yas |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | KDaveeD |
| పేజీలు విడదీసినది | KDaveeD |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | Nandhni |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |